Licenced to Post without Prepayment (PMG/VJA/PWPP/5/2014)




స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 84 సంచిక: 30 • 18-7-2014 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




# ఆంధ్రులకు చెంపదెబ్బ, గోడ దెబ్బ!

రాష్ట్ర విభజన వల్ల ఆంధ్ర రాష్ట్రం బాగుపడుతుందని, అభివృద్ధి శరవేగంతో పరుగులు పెడుతుందని ఒక వర్గం ప్రజలు ఆశించారు. విభజనను స్వాగతించారు. హైదరాబాదులో ఆంధ్రులకు ఎటువంటి ఇబ్బందులూ ఎదురు కావని, హైదరాబాద్ నగర అభివృద్ధి కోసం విభజన తర్వాత కెసిఆర్ ఆంధ్రులకు పట్టు తివాచీలు పరుస్తాడని ఊహించారు మరొక వర్గంవారు. ఈ అంచనాల వల్లనే సమైక్యాంధ్ర నినాదానికి ఆంధ్ర ప్రాంతంలో పెద్దగా ఆదరణ లభించలేదు. మొన్నటి ఎన్నికలలో విభజన ఒక సమస్యగా మారక పోవడానికి కూడా అదే కారణం.

అయితే ఈ రెండు ఆశలు లేదా అంచనాలూ తిరగబడుతున్నాయి. ఆంధ్రలో అభివృద్ధి మీద, చంద్రబాబు దక్షత మీద ఎంతో నమ్మకం వున్న వారిలో కూడా ఇప్పుడు అనుమానాలు పొడసూపుతున్నాయి. ఏ కారణం వల్లనో తెలియదు కానీ, చంద్రబాబు నాయుడు జనం ఆశించిన రీతిలో అడుగులు ముందుకు వేయలేకపోతున్నాడు. రైతు రుణమాఫీ ఆయన పాలిట ఒక పీడ కలగా మారడం ఒక కారణం కావచ్చు. పరిపాలనలో కూడా చంద్రబాబు నుంచి జనం ఆశించిన పోకడ కన్పించడం లేదు. మంత్రుల ఎంపికలో, అధికారులకు పని అప్పచెప్పడంలో, పరిపాలనాపరమైన నిర్ణయాలు తీసుకోవడంలో, పార్టీలో ఉత్తేజం కల్పించడంలో చంద్రబాబు నుంచి జనం ఆశించింది వేరు, జరగుతున్నది వేరు. దానితో అనుకొన్న రీతిలో రాష్ట్ర అభివృద్ధి అనేది సాధ్యమా అన్న అనుమానాలు పుట్టుకొస్తున్నాయి.

దాని సంగతి పక్కన పెడితే, హైదరాబాదులో ఆంధ్రుల పరిస్థితి ఆందోళనకరంగా మారుతున్నది. అయ్యప్ప సొసైటీ అక్రమ కట్టడాల కూల్చివేత ఇందుకు ఉదాహరణ. హైదరాబాదులో ఆక్రమణలు లేని ప్రాంతం లేదు. కానీ మొన్నటి ఎన్నికలలో అయ్యప్ప సొసైటీ వాసులు తనకు ఓటు వేయలేదనే ఒకే ఒక కారణంతో వారిని వెంటాడి వేధిస్తున్నాడు కెసిఆర్.

కొరవ 14వ పేజీలో

## • ఇద్దరు నెల్లూరు ఎమ్మెల్యేలు

# గోడ దూకబోతున్నారా?

వైఎస్ఆర్ కాంగ్రెస్ నుంచి పెద్ద సంఖ్యలో ఎమ్మెల్యేలను తమ వైపు ఆకర్షించే ప్రయత్నానికి తెలుగుదేశం పార్టీ శ్రీకారం చుట్టినట్లు తెలుస్తున్నది. నువ్వు నేర్పిన విద్యయే నీరజాక్ష అన్నట్లు, గతంలో టిఆర్ఎస్, తెలుగుదేశం ఎమ్మెల్యేల పట్ల వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అనుసరించిన పోకడనే పునరావృతం చేయబోతున్నాడు చంద్రబాబు. 2009లో ఎన్నికలు ముగిసిన వెంటనే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, బాల నాగిరెడ్డిలను తన పార్టీలో చేర్చుకొన్నాడు వైఎస్ రాజశేఖర్‌రెడ్డి. టిఆర్ఎస్ నుంచి కూడా దాదాపు పెద్ద సంఖ్యలో ఎమ్మెల్యేలను తన వైపు తిప్పుకొన్నాడు. 2004లో కూడా అదే పని చేశాడు. పార్టీ ఫిరాయించిన ఎమ్మెల్యేల మీద అనర్హత వేటు పడకుండా స్పీకర్ల ద్వారా కాపాడాడు. ఏళ్ల తరబడి అనర్హత ఫిర్యాదును పక్కన పెట్టి, కాలయాపన చేశారు అప్పటి స్పీకర్లు.

ఇప్పుడు కూడా అదే నమూనాలో జగన్ పార్టీ ఎమ్మెల్యేల మీద ఆకర్షణ మంత్రం పటిస్తున్నాడు చంద్రబాబు. ఇరవై నుంచి 25 మంది ఎమ్మెల్యేల వరకు అందుకు సుముఖంగా వున్నట్లు వినికిడి. ఈ స్థాయిలో జగన్ పార్టీ నుంచి వలసలు జరిగితే ఆ

కొరవ 14వ పేజీలో






# సత్వర న్యాయం

దేశంలోని న్యాయస్థానాలు సంవత్సరంలో 365 రోజులూ పని చేయాలని సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ లోధా ఒక ప్రతిపాదన చర్చకు పెట్టారు. "జస్టిస్ డిలెయిడ్ ఈజ్ జస్టిస్ డినైడ్" (సకాలంలో జరగనపుడు న్యాయం నిరాకరించనట్లే లెక్క) అనేది న్యాయ స్థానాల ప్రాథమిక సూత్రం. కానీ దురదృష్ట వశాత్తు మన దేశంలో న్యాయస్థానాలు ఆలస్యానికి పెట్టింది పేరుగా మారాయి. దేశం మొత్తం మీద వివిధ న్యాయ స్థానాలలో దాదాపు 3కోట్ల కేసులు అపరిష్కృతంగా ఉన్నాయని అంచనా. ఒక్క సుప్రీంకోర్టులోనే 60వేల వరకు కేసులు పేరుకొనిపోయి వున్నాయి. న్యాయం కోసం న్యాయ స్థానాలకు వెళ్లినవారు ఏళ్ల తరబడి ఎదురు చూపులతోనే సరిపెట్టుకోవాల్సి వస్తున్నది. చాలా సందర్భాలలో న్యాయం కోసం కోర్టు గుమ్మం తొక్కినవారు తీర్పులు వెలువడక ముందే కాలధర్మం చెంది పోతున్నారు. దేశం మొత్తం మీద అన్ని కోర్టులలో ఉన్న కేసులను రెండు మూడేళ్లలో పరిష్కరించాలంటే 10 లక్షల కోట్ల రూపాయల పెట్టుబడి అవసరమని అంచనా. అంత భారం మోసే శక్తి ప్రభుత్వాల వద్ద లేదు. దానితో కేసులు సంఖ్య ఏటికి ఏడాది పెరిగి పోతున్నదే తప్ప తరగడం లేదు.

అన్ని న్యాయ స్థానాలూ ఏడాది పొడవునా పని చేస్తే ఈ సమస్యకు ఒక పరిష్కారం దొరుకుతుందని సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి అభిప్రాయపడ్డారు. ఆయన ప్రతిపాదనలో కొంత సహేతుకత వుంది. మన దేశంలో కోర్టులు పని చేసే సమయం కంటే సెలవులతో పొద్దు పూచే సమయమే ఎక్కువ. ఏడాదిలో సుప్రీంకోర్టు పని చేసేది 170 నుంచి 180 రోజులు మాత్రమే. శని, ఆది వారాలు, పండుగ సెలవులతోపాటు వేసవి సెలవులు, శీతాకాల విరామం పేరిట ప్రతి రెండో రోజు మూతపడుతున్నది సుప్రీంకోర్టు. హైకోర్టుల పరిస్థితీ అంతే. కోర్టు పని చేసే రోజులలో కూడా న్యాయమూర్తుల వ్యక్తిగత సెలవులు పెడితే వీటికి అదనం. అంతర్జాతీయ సదస్సులు, సమావేశాల పేరిట ప్రతి న్యాయమూర్తీ మరికొన్ని రోజులు కోర్టుకు హాజరు కావడం లేదు. ప్రపంచంలోని మరే దేశంలో కూడా న్యాయమూర్తులకు ఇంత సుఖం లేదు. దీన్ని దృష్టిలో పెట్టుకొనే జస్టిస్ లోధా 365 రోజుల పని దినాల చర్చ పెట్టారు.

అయితే సహచర న్యాయమూర్తులు కానీ, న్యాయవాద సంఘాలు కానీ ఈ ప్రతిపాదనను అంగీకరించడం లేదు. కనీసం దీనిపై చర్చకు కూడా అంగీకరించడం లేదు. సరైన విశ్రాంతి లేకుండా తాము పని చేయలేమని బార్ అసోసియేషన్లు ఒక్కుమ్మడిగా ఈ ప్రతిపాదనను తీసి పక్కన పారేస్తున్నాయి. కేసుల ఆలస్యానికి న్యాయమూర్తుల సెలవులు ఒక కారణమైతే, న్యాయవాదుల అలసత్వం మరొక కారణం. అర్థం పర్థం లేని కారణాలు చూపి కేసుల వాయిదా కోరడం న్యాయవాదులకు అలవాటై పోయింది. తమ దగ్గర ఏళ్ల తరబడి కేసులను అట్టి పెట్టుకోవడం న్యాయవాదులకు ఒక సరదా.

365 రోజులూ కోర్టులు పని చేయాలన్న ప్రతిపాదన అంగీకారం కాకపోయినా, కనీసం సత్వర న్యాయం అందించేందుకు ఉన్న అవకాశాలను పరిశీలించడం న్యాయవాదులు, న్యాయమూర్తులు కలిసి నిర్వర్తించ వలసిన బాధ్యత. ప్రతి న్యాయమూర్తీ రోజులో ఒక్క గంట అధిక కాలం పని చేస్తే పెండింగ్ కేసుల సంఖ్య రెండేళ్లలో నాలుగో వంతు తగ్గి పోతాయని ఒక అంచనా. సెలవు లేకుండా పని చేయడం కష్టం కావచ్చు కానీ రోజులో ఒక్క గంట అధికంగా పని చేయడం అసాధ్యమేమీ కాదు. సరైన కారణం లేకుండా కేసుల వాయిదాను అనుమతించకుండా నియమాలను నిర్దేశించుకోవడం ద్వారా కూడా ఈ సమస్యకు కొంత వరకు పరిష్కారం వెతకవచ్చు. కొత్త కోర్టులు పెట్టాలంటే పెట్టుబడి కావాలి. కానీ ఉన్న కోర్టులు సక్రమంగా పని చేయడానికి ఏ ఖర్చూ అవసరం లేదు. ఏ కోర్టులోనైనా దాఖలయ్యే కేసును ఒక నిర్ణీత కాల వ్యవధిలో పరిష్కరించాలన్న నియమం కూడా అవసరం. న్యాయం కోసం అర్రులు చాస్తున్న కోట్లాది మంది ప్రజల దురవస్థను రూపు మాపడానికి న్యాయమూర్తులు, న్యాయవాదులు సరైన దృక్పథంతో ఆలోచన చేయడం అవసరం.

## జనవాణి

### ఎవరు ప్రజాస్వామ్యవాదులు?

ప్రజాస్వామ్యాన్ని గూర్చి 67 సంవత్సరాలుగా గొప్పలు చెప్పుకొంటున్నాం. దేశంలో ఎన్నోరకాల ఎన్నికలు, ఈ మధ్య మన రాష్ట్రంలో జరిగిన ఎన్నికలన్నీ కోర్టు ఆదేశాల మేరకు జరిగినవే. ఎప్పటి మాదిరిగానే రాజకీయ పార్టీలు ఓటర్లకు డబ్బు, మద్యం విపరీతంగా పంచి పెట్టారు. రాష్ట్ర విభజన సెంటిమెంట్‌తో పోలింగ్ కాస్త భారీగా జరిగింది. గత వారంలో జరిగిన జిల్లా పరిషత్, పురపాలక సంఘ ఎన్నికల్లో చంద్రబాబు వైకాపా సభ్యులను ఎరవేసి కొన్ని సంస్థలను చేజిక్కించుకొన్నారని వైఎస్ జగన్మోహన్‌రెడ్డి గవర్నర్, రాష్ట్రపతుల వద్దకు వెళ్లి ఫిర్యాదులు చేశారు. అసలు ఆపరేషన్ ఆకర్ష్, రిగ్గింగులకు ఆద్యులు వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కుటుంబీకులు. ఇప్పటికీ పులివెందులలో స్వేచ్ఛాయుత ఓటింగ్ జరుగుతుందా? ప్రజాస్వామ్య హంతకుడు ఎవరైనా ఉంటే వారిలో మొదటివాడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి. ఆయన నీతులు వల్లించడం దెయ్యాలు వేదాలు వల్లించినట్లుంది.

*వాస్తు రామచంద్ర* — నెల్లూరు

### వీఆర్ కాలేజీలో వెట్టిచాకిరి

గతంలో నేను వీఆర్ కళాశాలలో చదివాను. ఈ మధ్య పనిబడి కాలేజీకి వెళ్లి ఇక్కడ పనిచేస్తున్న నా మిత్రుడిని కలసి జీతభత్యాల గూర్చి అడిగాను. నాలుగైదు వేలు మించి ఇవ్వరని అతను చెప్పిన సమాధానం విని ఆశ్చర్యపోయాను. వీఆర్ కాలేజీ ఎప్పటి నుంచో ఎయిడెడ్ కాలేజీ అయినా ఈ దుస్థితి ఎందుకో అర్థం కావడం లేదు. ఇక్కడ మేనేజ్‌మెంట్ తొత్తులుగా ఉన్న కాలేజీ సిఇఒ సుధాకర్‌రెడ్డి, లా కాలేజీ ప్రిన్సిపాల్ శాడిస్టులుగా మారి ఉద్యోగులను వేపుక తింటున్నట్లు విన్నాను. వీఆర్ కాలేజీ ఎవడబ్బ సొత్తు కాదు. రాష్ట్రంలో ఏర్పడిన కొత్త ప్రభుత్వమైన వీఆర్ కాలేజీలో జరిగిన, జరుగుతున్న అన్యాయాలపై విచారణ చేసి పాత మేనేజింగ్ కమిటీ రద్దుచేసి ప్రత్యేకాధికారి పాలన ప్రవేశపెట్ట మనవి.

*ఒక పూర్వ విద్యార్థి* — నెల్లూరు

### పోస్టల్ శాఖ అబందర

నెల్లూరులో పోస్టల్ శాఖ ఉత్తరాల బట్వాడాలో నత్తనడకను గుర్తుకు తెస్తుంది. ప్రతి శుక్రవారం పోస్టుచేసే 'జమీన్‌రైతు' పత్రిక మరుసటి వారం బుధ, గురువారాలలోగానీ, నెల్లూరు నగర వాస్తులకు చేరడం లేదు. కొన్నిసార్లు రెండు వారాల పత్రికలు కూడా ఒకేసారి వస్తున్నాయి. పోస్టల్ శాఖ కుంభకర్ణ నిద్రను వీడి పాత రోజుల్లో మాదిరి జనరంజకంగా పనిచేయ మనవి. పోస్టల్ శాఖ ఉన్నతాధికారులు ఈ విషయమై చొరవ చూపాలి.

*పి.శ్రీనివాసులురెడ్డి* — నెల్లూరు

### అనిల్‌యాదవ్‌కు గుర్తింపు బిసిలకు గుర్తింపే!

నెల్లూరు సిటీ ఎమ్మెల్యే డాక్టర్ పి.అనిల్‌కుమార్ యాదవ్‌ను వైఎస్ జగన్మో

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**21-7-1944**
**పేజీలు:6 వెల: 0-1-6అణా**

### నివేశన స్థలాల యాలం

మదరాసు హిందూ ధర్మాదాయ సంఘము వారి ఆర్డరు నెం2476రు 16-6-44 తేదీ ఉత్తర్వు ప్రకారం క్రింద షెడ్యూలులో వివరింపబడిన మాగాణి య.797 సెంట్లు క్రింద చేర్వాలు చేసిన వారు యాలం వేయుదురు. ఈ భూములు నెల్లూరు మునిసిపల్ హద్దులలో ఇండ్ల స్థలాలకు అన్ని విధముల శ్రేష్ఠములై యున్నవి. ఇవి నెల్లూరు తూర్పు పొలం రైలు రోడ్డు కొత్త కాల్వల మధ్య సున్నపుబట్టీలకు దక్షిణంగా. కొనుగోలు చేయదలచిన వారు యాలంకు ముందే స్థలాలు చూచి రావచ్చును. ఈ పొలమును చెముడుగుంట వాని చేను అందురు.

–ఏ.సి.సుబ్బారెడ్డి

*మేనేజింగు ట్రస్టీ, శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానం*

### కస్తూరిదేవి విద్యాలయం

ప్రభుత్వానుమతి వచ్చింది. జూలై 7వ తేది నుంచి విద్యార్థినుల అడ్మిషన్ సాగుతున్నది. 16వ తేది ప్రారంభోత్సవమని లగ్నం నిర్ణయమైంది. అమ్ము స్వామినాథన్ ప్రారంభోత్సవం జరపడానికి అనుమతించింది. ఆహ్వానాలు పంచబడినవి. కానీ విద్యాలయ భవనంలో కాపురమున్న జిల్లా డాక్టరు నేను కదలను అని భీష్మించి కూర్చున్నాడు. చివరకు సరైన ఇల్లు చూపితే లేస్తానన్నాడు. యే ఇల్లు జూచినా ఏదో ఒక వరిక. యేదో వకగండం. రామ రామ ఆ బాధ చెపితే తీరదు. నెల్లూళ్లోయినాడు యిండ్ల కుండే బాధ వర్ణనాతీతం. ఏదైన కర్మ జాలక ఒకిల్లు దొరికితే దొరవారికి పనికిరాదు. ఇంతా భార్యాభర్త యిద్దరు. అంటే రెండు ప్రాణులు. కానీ యే ఇల్లు సరిపడదు. ఈ ప్రతిష్టంభనకు నెల్లూరంతా అట్టుడికినట్లు ఉడికింది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**17-7-1964**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### సోమశిలకు 5 కోట్లు

సోమశిల ప్రాజెక్టుకు నాల్గవ ప్రణాళికలో 5 కోట్ల రూపాయలు కేటాయించదలచినట్లు శాసనసభలో మంత్రి ఏ.సి చెప్పారు. కేంద్ర నదీలోయ ప్రాజెక్టులకు సంబంధించిన బృందం సోమశిలను నాల్గవ ప్రణాళికలో చేర్చుటకు సిఫారసు చేసిందట కూడా.

### సినిమాల మీద ఫిర్యాదు

నెల్లూరులోని థియేటర్లు(లీలామహల్ తప్ప) సినిమా జరిగేటప్పుడు బయట గేట్లు బిగించి ప్రేక్షకులకు తీరని ఇబ్బంది కల్గిస్తున్నారని; హాల్సు లోపల నాసిరకం పదార్థాలు అమ్ముతున్నారని; ఒక్కసారి స్వయంగా చూచి ఈ లోపాలను సరిదిద్దవలసిందని చాలా సంతకాలతో కలెక్టర్‌కు ఒక పిటిషన్ పెట్టబడింది. ఇదేమిటో మేమూ విచారించి పాఠకులకు నివేదిస్తాము.

### డిగ్రీ కోర్సు 3ఏళ్లే!

సాయంకాలం తరగతులలో ఇంతవరకు నాలుగేళ్లుగా వుండిన డిగ్రీ కోర్సును, మూడేళ్లకు తగ్గిస్తూ విశ్వవిద్యాలయం ఉత్తర్వు జేసిందట.

### శివారెడ్డి పద్యాలు
### నజీరియా బస్సు

రావడం సరిగ రాత్రి పన్నెండైంది
నజ్జీరియా బస్సు నమ్ముకుంటె
దిక్కులేని చావు, వక్కప్పు టీ త్రాగి
నడిచి పోర తండ్రి! నాల్గుమైళ్లు.

# నెల్లూరు ముచ్చట్లు

## వైద్య కళాశాల ప్రారంభం!

నెల్లూరీయుల ఎన్నో ఏళ్ల కల నెల్లూరు మెడికల్ కాలేజిని 19వ తేది రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రారంభిస్తారు. ఈ కార్యక్రమంలో కేంద్ర పట్టణాభివృద్ధి శాఖా మంత్రి ముప్పవరపు వెంకయ్యనాయుడు, రాష్ట్ర ఆరోగ్య మంత్రి డాక్టర్ కామినేని శ్రీనివాస్, మునిసిపల్ మంత్రి పొంగూరు నారాయణ పాల్గొంటారు. పెద్దాసుపత్రి ప్రాంగణంలో మెడికల్ కాలేజికి 365 కోట్ల రూపాయలతో భవన వసతి కల్పించారు. ప్రభుత్వ మెడికల్ కాలేజి ప్రారంభంతో నెల్లూరుకు మంచి రోజులు వచ్చాయనవచ్చు.

## కనివినీ ఎరుగని భద్రత!

13వ తేది జిల్లా పరిషత్ ఛైర్మన్ ఎన్నికను పురస్కరించుకొని పోలీసులు ఇప్పటివరకు ఎప్పుడూ లేనట్లుగా జిల్లా పరిషత్‌ను నాలుగు వైపులా పటిష్టమైన భద్రతా ఏర్పాట్లు చేశారు. తూర్పున లీలామహల్ సెంటర్, పడమర అనిత హాల్, దక్షిణాన మురళీకృష్ణ హోటల్, ఉత్తరాన బారకాస్ సెంటర్ వరకు నాలుగు వైపులా దారులు మూసేసి బారికేడ్లు కట్టేశారు. జడ్పీ చుట్టుప్రక్కల ఏడు వందలకు పైగా పోలీసులను మోహరించారు. జడ్పీ ఆఫీసు ప్రవేశ మార్గంలో రెండు మెటల్ డిటెక్టర్లను ఏర్పాటు చేశారు. మీటింగ్ హాలు లోపల జడ్పీటీసి సభ్యులు, ఎమ్మెల్యేలు, ఎమ్పీలు, ఎమ్మెల్సీలకు, ఎన్నికల నిర్వహణ అధికారులకు వేరువేరుగా ప్రవేశ ద్వారాలు ఏర్పాటు చేశారు. లోపలికి వెళ్లిన సభ్యులు బోనులలో చిక్కుకున్నట్లు ప్రత్యేకమైన మెష్ ఏర్పాటు చేశారు. వైకాపా, టిడిపి సభ్యుల మధ్య మెరికల్లాంటి యువతీ, యువకులైన పోలీసులను మార్షల్స్ మాదిరి అడ్డంగా నిలబెట్టారు. వీరికి రూరల్ డిఎస్పీ రాంబాబును నాయకునిగా నియమించారు. ఇంత అసాధారణ భద్రత కూడా జడ్పీ సమావేశంలో గొడవను నిలువరించకపోవడం చర్చనీయాంశమైంది.

## నోరుగల వైకాపా జడ్పీటీసిలు!

జడ్పీ సమావేశం ఆరంభానికి పూర్వమే వైకాపా, తెలుగుదేశం జడ్పీటీసి సభ్యుల మధ్య పెద్ద వాగ్వివాదం నడిచింది. కావలి జడ్పీటీసి సభ్యురాలు సోమయ్య గారి పెంచలమ్మ పోలీసులు అదుపులో తీసుకొన్నారనే విషయమై పోలీసులతో రెట్టించుకొన్న ఓ జడ్పీటీసి సభ్యురాలు పనిలో పనిగా నిలబడి ఉన్న తెలుగుదేశం పార్టీ జడ్పీటీసి సభ్యులను ఉద్దేశించి కొజ్జావోడా... కూర్చోరా అనే అసహ్య పదజాలాన్ని ప్రయోగించడంతో అవాక్కవడం వాళ్ల వంతవయ్యింది. గత జడ్పీటీసి సమావేశంలోనూ ఈ సభ్యురాలు తెలుగుదేశం పార్టీ జడ్పీటీసిలను బాగా అడ్డుకొన్నందుకు ఈమెను జగన్మోహన్‌రెడ్డి చేత ప్రశంసింపజేయడంతో ఈ సభ్యురాలు ఎందరు వారిస్తున్నా తిట్టిన తిట్టు తిట్టకుండా తన 'తడాఖా' చూపించింది.

## ఆద్యంతం నిలబడి వార్తాసేకరణ

జిల్లాపరిషత్ సమావేశ మందిరంలో జరిగిన తీరుతెన్నును ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ మీడియా ఆద్యంతం నిలబడే కవరేజీ చేయాల్సిన దుస్థితి కల్గింది. మీడియాకు కేటాయించిన స్థలంలో అడ్డంగా బారికేడ్లు కట్టారు. కూర్చుంటే అసలు ఏమి జరుగుతుందో తెలియని అస్పష్టత. దీంతో కొందరు ఫోటో, వీడియా గ్రాఫర్లు బారికేడ్లు, కుర్చీ లెక్కారు. అవకాశం లేనివారు వారినడిగే కవరేజీ చేసుకోవాల్సి వచ్చింది. ఇంత దయనీయ పరిస్థితి ఇప్పటివరకు జిల్లాలో జరిగిన ఏ సమావేశంలోనూ మీడియాకు కలగలేదనాలి.

## కలెక్టర్ మాటవినరేమి?

జడ్పీ సమావేశంలో నిలబడి ఉన్న తెలుగుదేశం సభ్యులను మార్షల్స్ ఎత్తి బయటవేసేయమని కలెక్టర్ శ్రీకాంత్ పదే పదే నెల్లూరు ఆర్డీఓ, రూరల్ డిఎస్పీని కోరినా వాళ్లు ఆయన ఆదేశాలను ఖాతరు చేయలేదు. స్పృహ తప్పిన కోట జడ్పీటీసి సభ్యుడు ప్రసాద్ గౌడ్‌ను హాస్పిటల్‌కు తరలించమన్నా వినే వారు లేరు. గౌడ్‌కు ఏదైనా అయితే ఆర్డీఓ, డిఎస్పీనే బాధ్యత వహించాల్సి వస్తుందని చెప్పినా పట్టించుకొనే దిక్కు లేకపోవడం విశేషం.

## పోలీసులను పట్టించుకోని ఆవులు, కుక్కలు!

జడ్పీ ఆఫీసు వద్ద నాలుగు వైపులా బారికేడ్లు నిర్మించి ఎవరినీ తమ బందోబస్తు మధ్య నడవనీయని పోలీసులను ఈ ప్రాంతంలో నిరంతరం తిష్టవేసి ఉండే ఆవులు, కుక్కలను మాత్రం తిరగకుండా చేయలేక పోయారు. ఇవి బారికడ్లను, పోలీసు లాఠీలను చూసి బెదరకపోవడం చర్చనీయాంశమయ్యింది.

## ఇక జడ్పీ తెలుగుదేశందే!

ఈ అభిప్రాయాన్ని సాక్షాత్తు నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్ రెడ్డి వ్యక్తం చేశారు. సమావేశం వాయిదా పడ్డాక బయటకు వచ్చి ఎమ్పీ ఆవేశంగా మాట్లాడుతూ ఇంత అప్రజాస్వామికంగా అధికారులు, పోలీసులు, అధికార పార్టీకి తొత్తులయ్యాక వైకాపాకు నెల్లూరు జడ్పీ పీఠం వస్తుందన్న నమ్మకం లేదన్నారు. ప్రజాస్వామ్యాన్ని ఉరివేశారంటూ హావభావాలతో మరీ చెప్పుకొచ్చారాయన.

**చందాదారులకు మనవి**

- **చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.**
- **మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.**
- **'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.**
- **చెక్కులు స్వీకరించబడవు.**

**జీవిత చందా రూ.2000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.250/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
**పొగతోట, నెల్లూరు - 524 001**
**ఫోన్: 0861 - 2327354**
**సెల్: 98489 66190**

## మంత్రి నారాయణను తిట్టిన శ్రీధర్!

జడ్పీ సమావేశం వాయిదా పడ్డాక విలేకరులతో నెల్లూరు రూరల్ శాసన సభ్యుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ అధికారం చేతిలో ఉంటే ఏమైనా చేయవచ్చని మంత్రి నారాయణ భావిస్తున్నట్లున్నారు. ఆయన కొందరు సభ్యుల ఇళ్లకు వెళ్లి దౌర్జన్యం చేశారు. ఇది మంచి పద్ధతి కాదన్నారాయన. నారాయణ దౌర్జన్యం చేశారంటే నమ్ముదామా?

## వెంకయ్యనాయుడిని కలిసిన అజీజ్!

నెల్లూరు మేయర్ అబ్దుల్ అజీజ్ 14వ తేది ఢిల్లీలో కేంద్ర పట్టణాభివృద్ధి శాఖామంత్రి ముప్పవరపు వెంకయ్యనాయుడిని మర్యాదపూర్వకంగా కలుసుకొన్నారు. ఈ సందర్భంగా నగరంలో డ్రైనేజి, తాగునీటి వ్యవస్థలు తీన్తారైనా విషయాన్ని వెంకయ్యనాయుడు దృష్టికి తీసుకొచ్చారు. కొత్త డ్రైనేజి, త్రాగునీటి వ్యవస్థలను ఏర్పాటుకు నిధులు మంజూరు చేయాలని కోరారు. వెంకయ్యనాయుడు, అజీజ్ వాళ్ల కుటుంబాలు మిలటరీ కాలనీలో ఎదురెదురుగా నివాసముండేవారు. దీనివల్ల అజీజ్ చిన్నపిల్లవాడిగా ఉన్నప్పటి నుండి వెంకయ్యనాయుడికి సుపరిచితుడు. ఈ పరిచయాన్ని కూడా ఆయన నగరాభివృద్ధికి ఉపయోగించాలని ఆలోచించడం శుభపరిణామం.

## ముక్కాల పదవీ బాధ్యతల స్వీకరణ

నెల్లూరు డిప్యూటీ మేయర్‌గా ముక్కాల ద్వారకానాథ్ 14వ తేది కార్పొరేషన్ ఆఫీసులో బాధ్యతలు స్వీకరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నగర ప్రజలు తమపై ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేయకుండా అందరి సహకారంతో నగరాన్ని అన్నివిధాల అభివృద్ధి పరుస్తానన్నారు. ఈ కార్యక్రమంలో నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, నెల్లూరు సిటీ ఎమ్మెల్యే అనిల్ కుమార్ యాదవ్ పలువురు కౌన్సిలర్లు పాల్గొన్నారు.

## నెల్లూరులో దోమల మోత!

నెల్లూరులో ఇటీవల కురిసిన నాలుగు చినుకులకే దోమల మోత జాస్తయ్యింది. నగరంలో చెత్త ఎత్తకపోవడం, కాల్వలు శుభ్రపరచకపోవడంతో కొద్దిపాటి వర్షానికే వాటి పొట్ట పగిలిపోయింది. దోమల దెబ్బకు జనాలకు అలివికాని జ్వరాలొస్తున్నాయి. కార్పొరేషన్ కమిషనర్ గారికి జనం బాధలే పట్టవు. నీవైనా పట్టించుకో అజీజ్ భాయ్.

## టమోటా కిలో 60 రూపాయలు

నెల్లూరు ఏసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్‌లో కూరగాయల రేట్లు రోజురోజుకు పెరిగి పోతున్నాయి. నాణ్యమైన సరకులేకున్నా రేట్లు, తూకం షరా మామూలే. అందరికీ నిత్యావసరమైన టమోటా కిలో 60 రూపాయలమ్ముతున్నారు. బీన్స్, పందిరి చిక్కుళ్లు కిలో 90 రూపాయలు దగ్గర రేట్లు స్థిరంగా ఉన్నాయి.

## జీవప్రదాతకు సజలనయన ప్రణామం!



**20వ తేదికి 21 సంవత్సరాలు గడుస్తాయి - ఈ 21 సంవత్సరాలు ఇరవై ఒక్క యుగాలుగా కన్పిస్తున్నాయి. తుదిశ్వాస విడిచే వరకు పత్రికా సంపాదకత్వమే తన ప్రాణంగా భావించి, పత్రిక భవిష్యత్తు కోసం జీవితం పణంగా పెట్టిన జమీన్‌రైతు జీవ ప్రదాత నెల్లూరు శ్రీరామమూర్తి గారి ఎడబాటు - ఎన్నేళ్లు గడిచినా దుర్భరంగానే కన్పిస్తున్నది. 21వ వర్ధంతి సందర్భంగా సజల నయనాలతో ఆయన్ను స్మరించుకొంటున్నాము; ప్రణమిల్లు తున్నాము.**

**- జమీన్‌రైతు కుటుంబం**

## బాబు వీడియో కాన్ఫరెన్స్

ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు జిల్లా అధికారులతో 15వ తేదీ వీడియో కాన్ఫరెన్స్ నిర్వహించారు. ఆయన గతంలో ముఖ్యమంత్రిగా వున్నప్పుడు భూగర్భ జలాల మట్టం పెంచేందుకు నీరు – మీరు కార్యక్రమాన్ని సమర్థవంతంగా అమలు చేసిన సంగతి తెలిసిందే. ఇళ్లలో ఇంకుడు గుంటలు పెట్టించడం తదితర చర్యలు ఎన్నో చేపట్టారు. ఆతర్వాత పదేళ్లు పదవికి దూరంగా వుండాల్సి వచ్చింది. తిరిగి ముఖ్యమంత్రి పీఠంపై కూర్చున్న ఆయన తన మార్క్ పాలనకోసం అధికారులతో వీడియో కాన్ఫరెన్స్‌లు నిర్వహిస్తూ నీరు – మీరు కార్యక్రమ ఆవశ్యకతను వివరించారు.

కొరవ 14వ పేజీలో

వజ్రం - బంగారం - వెండి ఫ్యాక్టరి అవుట్‌లెట్
BIS 916 హాల్‌మార్క్ బంగారు ఆభరణములపై* తరుగు అతి తక్కువ - కూలి లేదు.
డైమండ్స్ పై 10% తగ్గింపు*
సాధారణ వెండి వస్తువులపై* తరుగులేదు - కూలిలేదు.
*T&C Apply
గోల్డ్ ప్యాలెస్
ఆచారివీధి, హోటల్ శివం ఎదురుగా, జిల్లా పరిషత్ ఆఫీస్ సెంటర్, నెల్లూరు.
ఫోన్: 2331133, 2327611

సిల్వర్ ఫ్యాక్టరి అవుట్‌లెట్
సాధారణ వెండి వస్తువులపై* తరుగు లేదు, కూలి లేదు.
925 STERLING SILVER* (EXPORT QUALITY)
*T&C Apply
సిల్వర్ ప్లాజా
EXCLUSIVE SILVER SHOW ROOM
ఆచారివీధి, హోటల్ శివం ఎదురుగా, జిల్లా పరిషత్ ఆఫీస్ సెంటర్, నెల్లూరు.
ఫోన్: 2331132, 2331121

## ● నెల్లూరు కార్పొరేషన్‌లో

# అవినీతి లేకుండా చేస్తా!

### బాధ్యతల స్వీకరణ సందర్భంగా మేయర్ అబ్దుల్ అజీజ్



నెల్లూరు కార్పొరేషన్‌లో అవినీతి లేకుండా చేస్తానని 9వ తేది మేయర్‌గా పదవీ బాధ్యతలు చేపట్టిన అబ్దుల్ అజీజ్ స్పష్టం చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ కార్పొరేషన్‌లో అవినీతికి పాల్పడితే ఎంతటి వారినైనా వదిలే ప్రసక్తి లేదన్నారు. అవినీతికి పాల్పడినట్లు రుజువైతే వారిపై చట్ట ప్రకారంగా చర్యలు తీసుకొంటామన్నారు. గతంలో కార్పొరేషన్‌లో పెత్తనం చేసిన రాజకీయ నాయకుల ఒత్తిళ్ల కారణంగా అధికారులు కొన్ని పొరపాట్లు చేసి ఉండొచ్చు. గతంలోలాగా కాకుండా అభివృద్ధి విషయంలో అధికారులకు పూర్తి స్వేచ్ఛ కల్పిస్తామన్నారు. ప్రజలు, అధికారులు కలసి పనిచేస్తే సరికొత్త నెల్లూరును తీర్చి దిద్దడం చాలా సులభమన్నారు. కేంద్ర, రాష్ట్ర మంత్రులు వెంకయ్యనాయుడు, నారాయణల సహకారంతో నెల్లూరు నగరాభివృద్ధికి నిధులు తీసుకొని వస్తానన్నారు. రాజకీయాలు వేరు అభివృద్ధి వేరని ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. తనపూర్తి అజెండా అభివృద్ధి మాత్రమేనన్నారు. 54 డివిజన్లలో పనిచేస్తున్న అధికారులు ప్రజలకు అందుబాటులో ఉండేవిధంగా ఆయా డివిజన్లలో పనిచేస్తున్న అధికారులు ప్రజలకందుబాటులో ఉండే విధంగా అధికారుల పేర్లు, ఫోను నెంబర్లు వెల్లడిస్తామన్నారు. ఏ సమస్యపైనైనా తనకు గానీ, కమిషనర్‌కు గానీ మెయిల్‌లో ఫిర్యాదు పంపవచ్చున్నారు. కార్పొరేషన్ టోల్‌ఫ్రీ నెంబర్‌ను పునరుద్ధరిస్తామని, సమస్యలపై ఫిర్యాదు చేసిన వారికి ఒక నెంబర్ కూడా ఇస్తామని పేర్కొన్నారు. కార్పొరేషన్ పాఠశాలలో మౌలిక వసతుల కల్పనకు ప్రత్యేక దృష్టి పెడతానన్నారు. నగర ప్రజలకు సేవలను అందించేందుకు ప్రణాళికలు సిద్ధం చేస్తున్నట్లు తెలిపారు. అజీజ్ ప్రమాణ స్వీకారాన్ని పురస్కరించుకొని ఆయన ఛాంబర్‌లో హిందూ, ముస్లిం, క్రైస్తవ మత పెద్దలు ప్రార్థనలు చేసి మేయర్‌ను ఆశీర్వదించారు.

# మేయర్ వచ్చేసరికి అంతా సర్దేశారు!

### రెవిన్యూ ఇన్స్‌పెక్టర్, టౌన్ ప్లానింగ్ సెక్షన్‌లో పోస్టింగులకు పెద్ద మొత్తాలు వసూళ్లు



నెల్లూరు కార్పొరేషన్‌లో పనిచేస్తుండే ఉద్యోగుల్లో అవినీతి ఘనాపాఠీలు జాస్తి. వీరందరికీ ఇప్పటివరకు 'బాస్'గా కార్పొరేషన్ ఉద్యోగులు పిల్చుకునే మాజీ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అండదండలుండేవి. కార్పొరేషన్ తన హవా తగ్గనీయకుండా చూడనే ఆయన చాట్ల నరసింహారావును ఒక పథకం ప్రకారం తెలుగుదేశం పార్టీలో చేర్పించారని నగరంలో ఒక టాక్. కొత్త మేయర్ బాధ్యతలు తీసుకోకమునుపే కమిషనర్ జాన్ శ్యాంసన్ ద్వారా వివేకానందరెడ్డి చేయించిన కార్పొరేషన్ సిబ్బంది బదలీల్లో పెద్ద మొత్తాలు చేతులు మారాయంటున్నారు. రెవిన్యూ ఇన్స్‌పెక్టర్ పోస్టింగ్‌కు ఐదు లక్షల రూపాయలు, టౌన్ ప్లానింగ్ సెక్షన్‌లో మంచి డివిజన్‌కు వేస్తే పది లక్షలుగా ఇటీవల వసూళ్లు చేసి కొన్ని బదలీలు జరిగాయంటున్నారు. నగరంలో బిల్డింగ్ ఫీజులను ఖచ్చితంగా కట్టిస్తే ఏడాదికి కోటి రూపాయలకు పైగా మునిసిపల్ ఖజానాకు చేరుతాయి. కానీ మొత్తం కూడా ఖజానా వరకు చేరనివ్వకుండా సిబ్బంది తమ జేబుల్లో కుక్కేస్తున్నట్లు తెలిసింది. కొత్త మేయర్ అజీజ్ భాయ్ కార్పొరేషన్ గుర్చి తెలుసుకోకమునుపే ఎన్ని అవినీతి అక్రమాలను కళ్ల చూడాల్సి వస్తుందో ఆ భగవంతుడికే ఎరుకని చెప్పొచ్చు.

# బెజవాడ గోపాలరెడ్డి ఉమెన్స్ అకాడమీలో సరికొత్త కంప్యూటర్లు!

### రూ.4 లక్షలు సాయం చేసిన టి.సుబ్బరామిరెడ్డి

నెల్లూరు బెజవాడ గోపాల్‌రెడ్డి ఉమెన్స్ అకాడమీలోని కంప్యూటర్ సిస్టమ్స్ పాతవి కావడం వల్ల కొత్తవి పెట్ట సంకల్పించి కాలేజి కరస్పాండెంట్ జెవిరెడ్డి ఎమ్పీ తిక్కవరపు సుబ్బరామిరెడ్డిని అభ్యర్థించగా ఆయన నాలుగు లక్షల రూపాయలు విలువ చేసే తొమ్మిది కంప్యూటర్లు ఏర్పాటు చేశారు. వీటిని 10వ తేది అమర్చి సరికొత్త కంప్యూటర్ ల్యాబ్‌కు జెవిరెడ్డి రిబ్బన్ కత్తిరించి మాట్లాడారు. తమ కాలేజిలో చదివే ఆడపిల్లల భద్రతకు ప్రాముఖ్యమిస్తామని అందువల్లే ఈ యేడాది అడ్మిషన్లు బాగా పెరిగాయన్నారు. తమ కాలేజీని, స్కూల్‌ను మరింత నూతనంగా తీర్చిదిద్దను దాతలు, ప్రభుత్వం సహకరించాలన్నారు. అడిగిన వెంటనే ఉమెన్స్ అకాడమీలో కంప్యూటర్ సిస్టమ్స్‌ను ఇచ్చిన రాజ్యసభ సభ్యుడు డాక్టర్ తిక్కవరపు సుబ్బరామిరెడ్డికి జెవిరెడ్డి కృతజ్ఞతలు చెప్పారు.



కంప్యూటర్ ల్యాబ్‌ను ప్రారంభిస్తున్న జె.వి.రెడ్డి.

# కుటుంబ కలహాల్లో పోలీస్ మార్క్!

నిండు నూరేళ్లు కలసి జీవిస్తామని, ఒకరికి తోడుగా మరొకరం వుంటామని బాసలు చేసుకుని వివాహం చేసుకొనే దంపతులు చిన్న చిన్న వాటికే కుటుంబ బంధాలను తెగతెంపులు చేసుకొంటున్నారు. పోలీస్ స్టేషన్లను ఆశ్రయిస్తున్నారు. ఇందులో భార్యాభర్తల మధ్య ఎవరిది తప్పు అనే విషయాన్ని ప్రక్కన బెడితే కౌన్సిలింగ్ పేరుతో పోలీస్ స్టేషన్లలో నిర్వహించే ప్రక్రియలో పోలీస్ సిబ్బంది వ్యవహరించే తీరు కుటుంబ తగాదాలతో అక్కడకు వెళ్లే వారిని మానసిక క్షోభకు గురి చేస్తున్నది. ఫోర్త్‌టౌన్ వద్ద వుండే మహిళా పోలీస్ స్టేషన్లో ఇలాంటి కేసులను విచారిస్తుంటారు. నిత్యం ఈ స్టేషన్ వద్ద పదుల సంఖ్యలో వుండే జనాన్ని చూస్తే రోజు రోజుకు అధికమవుతున్న భార్యాభర్తల గొడవలు, కుటుంబాల్లో ఏర్పడుతున్న తగాదాలను తెలియజెప్తాయి. భార్యాభర్తల ఫిర్యాదులు విన్న మహిళా స్టేషన్ ఎస్ఐ, ఇతర ఉన్నతాధికారులు వారిరువురిని పిలిపించి సమస్యను అడిగి తెలుసుకొని, వారి మధ్య ఏర్పడిన వివాదాన్ని సమసి పోయేందుకు ముందుగా తమ వంతు కృషి చేస్తారు. కౌన్సిలింగ్ నిర్వహించి వారిలో మార్పు తెచ్చేందుకు ప్రయత్నిస్తారు. అందుకు ససేమిరా అంటే చివరకు కేసులు నమోదు చేస్తారు. అధికారుల పాత్ర, భార్యాభర్తలు, కుటుంబాల్లో ఏర్పడుతున్న వివాదాన్ని చక్కదిద్దేందుకు వారు చేస్తున్న కృషి

### కౌన్సిలింగ్ పేరుతో పోలీస్ హింస

బాగానే వుంటున్నా క్రిందిస్థాయి సిబ్బంది వ్యవహరిస్తున్న తీరు పట్ల విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. అసలే మానసికంగా ఒత్తిడిలో వున్న భార్యాభర్తల వద్దకు వచ్చి అందినంత డబ్బులు వసూలు చేయడమే కాకుండా అసభ్యంగా, అవమానకరంగా మాట్లాడుతున్న తీరు పట్ల కుటుంబ గొడవల్లో చిక్కుకుని మహిళా స్టేషన్‌కు వచ్చేవారు తీవ్ర వేదనకు గురౌతున్నారు. స్థానిక మహిళా స్టేషన్‌లో మొదట కౌన్సిలింగ్ నిర్వహించిన తర్వాత, పోలీస్ పెరేడ్ గ్రౌండ్ వద్దగల ఉమేష్ చంద్ర సమావేశ మందిరంలో మరో సారి ఇలాంటి వారిని కౌన్సిలింగ్ కమిటీ పిలిచి కౌన్సిలింగ్ చేస్తుంటారు. ఇక్కడ విధులు నిర్వహించే హోమ్‌గార్డులు, కానిస్టేబుళ్లు అత్యంత అవమానకరంగా మాట్లాడడం, ఒరేయ్ తురేయ్ అంటూ సంబోధించడం పట్ల పలువురు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. సమాజంలో ఉన్నత ఉద్యోగాలు చేసుకుంటూ ఉన్నత చదువులు చదువుకున్న తాము కుటుంబ కలహాల వల్ల పోలీస్‌స్టేషన్ గడప తొక్కాల్సి వచ్చి మానసిక క్షోభకు గురౌతుంటే కొందరు పోలీసుల వ్యవహరిస్తున్న తీరు మానసికంగా మరింత బాధ పెడుతున్నదని వాపోతున్నారు. ఎస్పీ గారూ దీనిపై ఒకసారి దృష్టి సారించండి.

# రేషన్ షాపుల్లో కొనసాగుతున్న అవినీతి!

నెల్లూరు నగరంలోని పలు రేషన్ షాపుల్లో లబ్దిదారులకు నిత్యావసర సరుకులు అందడం లేదు. రచ్చబండ కార్యక్రమం సందర్భంగా రేషన్ కార్డుల మంజూరుకు దరఖాస్తు చేసుకున్న వారిని గుర్తించి కూపన్లు మంజూరు చేశారు. పౌరసరఫరాల శాఖ జారీచేసిన కూపన్లకు అవసరమైన సరుకులు సమీప రేషన్ షాపుల్లో పంపిణీ చేయాలి. కానీ అందుకు భిన్నంగా రేషన్ షాపు డీలర్లు వ్యవహరిస్తున్నారు. స్టాక్ పాయింట్ల నుండి సరుకులు అందినప్పటికీ పూర్తిస్థాయిలో వీటిని పంపిణీ చేయకుండా బయట మార్కెట్‌కు తరలిస్తున్నారన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. సరుకులు కోసం రేషన్ షాపుల చుట్టూ తిరుగుతున్న సరైన సమాధానం చెప్పలేక పోతున్నారు. సరుకులు అందకపోవడంతో అధిక ధరలకు మార్కెట్లో సరుకులు కొనుగోలు చేయాల్సి వస్తుందని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. రెవిన్యూ, పౌరసరఫరాల శాఖ అధికారులకు సరుకులు సక్రమంగా పంపిణీ జరగని విషయం తెలిసినప్పటికీ ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. నిత్యావసర సరుకులు పక్కదారి పడుతున్నా పూర్తిగా నిఘా కొరవడింది. ఇటీవల కొన్ని గోడౌన్లలో అక్రమంగా నిల్వ వుంచిన సరుకులను అధికారులు

### ● కూపన్లు ఇచ్చిన వారికి సరకులివ్వరు

గుర్తించి సీజ్ చేయడం జరిగింది. సీజ్ చేసిన సరుకుల్లో కొన్ని రేషన్ షాపులకు సరఫరా చేసినవిగా నిర్ధారించారు. ఈ సరుకులు ఎక్కడ నుండి గోడౌన్లకు వచ్చాయి? ఎవరి ప్రమేయం వుంది అన్న దానిపై విచారణ జరగడం లేదు. ఇప్పటికైనా ప్రజా పంపిణీ వ్యవస్థను పర్యవేక్షించే జాయింట్ కలెక్టర్ స్పందించి దృష్టి సారించాల్సిన అవసరం వుంది.


స్వాగతం! సుస్వాగతం!!
ఆంధ్రప్రదేశ్ దశదిశా నిర్దేశకుడు
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు
శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు
నెల్లూరు అభివృద్ధిపై ప్రత్యేక దృష్టి పెట్టే దార్శనికుడు
కేంద్ర పట్టణాభివృద్ధి శాఖామాత్యులు
శ్రీ ముప్పవరపు వెంకయ్యనాయుడు గారు
నెల్లూరీయుల ఎన్నో ఏళ్ల కల మెడికల్ కాలేజి
ప్రారంభోత్సవానికి సింహపురికి విచ్చేస్తున్న
శుభ సందర్భంలో స్వాగతం! సుస్వాగతం!!
బొల్లినేని శ్రీధర్
ఎం.డి. సువర్ణభూమి డెవలపర్స్
హైదరాబాద్
బొల్లినేని శ్రీహరి
తెలుగుదేశం పార్టీ నాయకులు
నెల్లూరు
బొల్లినేని శ్రీవిద్య
22వ డివిజన్ కార్పొరేటర్
తెలుగుదేశం పార్టీ, నెల్లూరు

● వెంకటగిరిని

# ఆదర్శ మునిసిపాలిటీ చేస్తా!



వెంకటగిరి మున్సిపాలిటీని ఆదర్శ మున్సిపాలిటీగా తీర్చిదిద్దుతానని మున్సిపల్ ఛైర్మన్‌గా నూతనంగా బాధ్యతలు చేపట్టిన దొంతు శారద తెలిపారు. ప్రమాణ స్వీకారం అనంతరం ఆమె పుర ప్రజలనుద్దేశించి ప్రసంగించారు. ప్రధానంగా మున్సిపాల్టీలో మంచినీటి సమస్య అధికంగా వుందన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని తొలి ప్రాతినిధ్యం మంచినీటి సమస్య పరిష్కారానికేనన్నారు. అందుకోసం ప్రత్యేక చర్యలు చేపడుతున్నామన్నారు. మునిసిపాలిటీ పరిధిలోగల 25 వార్డులలో పర్యటించి ఎప్పటికప్పుడు ప్రజల సమస్యల పరిష్కారానికి తనవంతు కృషి చేస్తానన్నారు. సహచర కౌన్సిలర్ల సహకారంతో పార్టీలకు అతీతంగా మునిసిపాలిటీని అభివృద్ధి చేస్తానని, చక్కని పాలన అందిస్తానని హామీ ఇచ్చారు. అనంతరం మునిసిపల్ కార్యాలయంలోని అన్ని విభాగాలను పరిశీలించి సిబ్బందితో మాట్లాడారు. ఈ కార్యక్రమంలో మునిసిపల్ వైస్ ఛైర్మన్ బీరం రాజేశ్వరరావు, కౌన్సిలర్లు చెంగారావు, టిడిపి నేతలు శాతరాసి బాలయ్య, మధుసూధనరెడ్డి, మేరిగ రామకృష్ణ, బాబు, గోపాలరెడ్డి తదితరులు పాల్గొన్నారు.



బోగోలు మండలాధ్యక్షురాలుగా పదవీ బాధ్యతలను స్వీకరిస్తున్న పర్రి సులోచనమ్మ.

● గూడూరు ఎమ్పీపి ఎన్నికల్లో

# నువ్వా - నేనా!

**మూడు మండలాల్లో వైకాపా**

**రెండు మండలాల్లో టిడిపి**

గూడూరు నియోజకవర్గంలోని ఐదు మండలాల్లో మూడు మండలాల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ, రెండు మండలాల్లో తెలుగుదేశం పార్టీ మండల పరిషత్ అధ్యక్ష స్థానాలను కైవసం చేసుకొంది. చిట్టమూరు మండలంలో 11 ఎంటిఎంసి స్థానాలకు గాను 7 స్థానాలను తెలుగుదేశం పార్టీ, 3 వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ, రెండు స్థానాలలో స్వతంత్రులు విజయం సాధించారు. వీటిలో తెలుగుదేశం అభ్యర్థి ఉక్కు జనార్దన్‌ను ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. వాకాడు మండలంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి పాపారెడ్డి సుజాతమ్మ, కోట మండలంలో ఆ పార్టీ అభ్యర్థి నల్లపురెడ్డి వినోద్‌కుమార్‌రెడ్డి హస్తగతం చేసుకొన్నారు. చిల్లకూరు మండలంలో మొత్తం 15 స్థానాలకు గాను తెలుగుదేశం 5, వైసిపి 6, కాంగ్రెస్ 2, స్వతంత్రులు మరో రెండు స్థానాల్లో గెలుపొందారు. అయితే మండలంలో కాంగ్రెస్, ఇండిపెండెంట్ అభ్యర్థులు తెలుగుదేశానికి మద్దతు తెలపడంతో ఆ పార్టీ బలం తొమ్మిదికి చేరింది. దీంతో టిడిపి ఎంపిపి అభ్యర్థిని వీరిబోయిన రమాదేవి ఎంపిపిగా విజయం సాధించింది. గూడూరు మండలానికి సంబంధించి మొత్తం 16 స్థానాలకు గాను 9 స్థానాల్లో వైసిపి, 7 స్థానాల్లో టిడిపి విజయం సాధించింది. వైసిపికి బలం వుండడంతో ఆ పార్టీ అభ్యర్థిని పిట్టి రావమ్మ ఎంపిపిగా గెలుపొందింది.

# ఆ రెండు పార్టీల తీరు సరిలేదు!

**జడ్పీ ఎన్నిక గూర్చి బిజెపి వ్యాఖ్యానం**



జిల్లా పరిషత్ ఛైర్మన్ ఎన్నిక సందర్భంగా తెలుగుదేశం, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు వ్యవహరించిన తీరు జుగుప్సాకరంగా వుందని బిజెపి అధికార ప్రతినిధి కర్నాటి ఆంజనేయరెడ్డి ఆక్షేపించారు. రాజకీయాల్లో విలువలు పతనమై పోతున్నాయనేందుకు ఈ ఘటన ఒక ఉదాహరణన్నారు. మనుబోలులో జరిగిన బిజెపి మండల కార్యవర్గ సమావేశంలో పాల్గొన్న ఆయన విలేకరులతో మాట్లాడారు. ప్రజాస్వామ్యయుతంగా జరగాల్సిన జిల్లా పరిషత్ ఛైర్మన్ ఎన్నిక రోజున అధికార, ప్రతిపక్ష పార్టీల నేతలు వ్యవహరించిన తీరు ప్రజాస్వామ్యానికే మాయని మచ్చలా, కళంకం తెచ్చేలా వుందని ఆవేదన వ్యక్తం చేశారు. ఆ సమయంలో జిల్లా కలెక్టర్ ఆదర్శవంతంగా వ్యవహరించడం అభినందనీయ మన్నారు. ఇలాంటి ఘటనలు పునరావృతం కాకుండా చూడాల్సిన బాధ్యత రాజకీయ పార్టీల పైనే వుందన్నారు. రైతుల రుణమాఫీపై ప్రభుత్వం కమిటీల పేరుతో కాలయాపన చేయకుండా వెంటనే అమలు చేయాలని డిమాండ్ చేశారు. ఎన్డీఏ ప్రభుత్వ హయాంలో మంజూరై నిలచిపోయిన పరిశ్రమలు, ఎఫ్ఎం రేడియో స్టేషన్ ఏర్పాటుకు ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తామన్నారు.

● దిష్టిబొమ్మల్లా

# శిలాఫలకాలు!

ముత్తుకూరు మండలానికి సంబంధించి వివిధ అభివృద్ధి పనుల కోసం వేసిన శిలాఫలకాలు ఏడాదిగా దిష్టిబొమ్మలుగా కన్పిస్తున్నాయి తప్ప అభివృద్ధి పనులు ఒక్క అడుగు ముందుకు పడలేదు. మండలంలోని వివిధ గ్రామాల్లో వేసిన శిలాఫలకాల పరిస్థితి ఇలాగే వుంది. పేదల నివాస గృహాలకు, పంచాయతీ కార్యాలయ భవన నిర్మాణాలకు వేసిన శిలాఫలకాలు అక్కడికే పరిమితం అయ్యాయి తప్ప నిర్మాణాలకు నోచుకోలేదు. ముఖ్యంగా పాటూరివారి కండ్రిగలో 10 లక్షల రూపాయల వ్యయంతో పంచాయతీ కార్యాలయం నిర్మించదలచారు. 2011లో ఈ నిర్మాణానికి ఆనాటి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి శంకుస్థాపన

**ముత్తుకూరులో ఇదీ పరిస్థితి**

చేశారు. దీనికి సంబంధించిన శిలాఫలకం ఏర్పాటయ్యింది తప్ప భవన నిర్మాణం జరగలేదు. బ్రహ్మదేవి, వరకవి పూడి రోడ్డు సెంటర్‌లో పేదలకు 150 పక్కా గృహాలు నిర్మించదలచి దీనికి శంకుస్థాపన చేశారు తప్ప ఇంతవరకు ఒక్క ఇల్లు పూర్తి కాలేదు. ఇదేవిధంగా పర్లపాడు దిబ్బలో 900 పక్కా గృహాల నిర్మాణానికి ఐదేళ్ల క్రిందట నిర్మిస్తామని ప్రజాప్రతినిధులు, అధికారులు తెలిపినా ఇంతవరకు ఆ దిశగా ఎలాంటి పని ప్రారంభం కాలేదు. రాష్ట్రంలో తెలుగుదేశం అధికారంలోకి వచ్చిన పరిస్థితుల్లో కొత్తగా వచ్చిన ప్రజాప్రతినిధు లైనా శిలాఫలకాలకే పరిమితమైన అభివృద్ధి పనుల గురించి పట్టించుకొంటారేమోనని మండల ప్రజలు ఆశగా ఎదురు చూస్తున్నారు.






# సర్వేపల్లిలో ఐదు ఎంపిపిలు వైకాపా స్వంతం!

తెలుగుదేశం పార్టీ అవగాహనా రాహిత్యంతో సర్వేపల్లి నియోజకవర్గంలోని ఐదు మండల పీఠాలను వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కైవసం చేసుకొంది. అధికార తెలుగుదేశం పార్టీ తగిన విధంగా వ్యవహరించలేక చతికిలబడింది. నియోజకవర్గ పరిధిలోని ముత్తుకూరు, పొదలకూరు, మనుబోలు, వెంకటాచలం, తోటపల్లి గూడూరు మండలాల్లో మండల అధ్యక్ష పదవులను వైసిపి తన గుప్పెట్లో పెట్టుకొంది. తోటపల్లి గూడూరు నుంచి ఎమ్పీపిగా నాయుడు గిరిజమ్మ, ఉపాధ్యక్షురాలిగా చెరుకూరి సరళ, ముత్తుకూరు నుంచి పిట్ల వెంకట సుబ్బయ్య, ఉపాధ్యక్షునిగా మురాల వెంకటేశ్వర్లు, మనుబోలు మండలాధ్యక్షురాలిగా తలపల అరుణ, ఉపాధ్యక్షునిగా వల్లూరు శ్రీధర్‌నాయుడు, పొదలకూరు నుంచి కోనం చిన బ్రహ్మయ్య అధ్యక్షుడిగా, పలుకూరి సుశీలమ్మ ఉపాధ్యక్షురాలిగా ఎన్నికయ్యారు. ఈ ఎన్నికల సమయంలో తెలుగుదేశం ఎంపిటిసిలు మోహం చాటే

**చతికిలబడ్డ తెలుగుదేశం**

శారు. ఈ మండలాల ఎన్నికల రిటర్నింగ్ అధికారులుగా వ్యవహరించిన రవిచంద్ర ప్రసాద్, ఎంపిడిఓ సావిత్రమ్మ, తహశీల్దార్ రామకృష్ణ, సత్యనారాయణ, ఎంపిడిఓ సుజాత, చంద్రశేఖర్‌రెడ్డి, సత్యవాణి, సాంబశివరావు ఓర్పు, నేర్పుతో ఎన్నికలను సజావుగా జరిపించారు.

# రేషన్ కార్డులివ్వండయ్యా!

## చింతలపాళెం గిరిజనుల వేడుకోలు

అయ్యా రేషన్ కార్డుల కోసం మూడేళ్లుగా తిరుగుతున్నాం పట్టించుకొనే నాధుడే లేకుండా పోయారు. ఇప్పటికైనా మాపై దయతలచి రేషన్‌కార్డులు ఇప్పించాలంటూ జలదంకి మండలం చింతలపాళెం గిరిజనులు అధికారులను కలసి విన్నవించుకొన్నారు. 50 గిరిజన కుటుంబాలు ఈ ప్రాంతంలో నివసిస్తున్నాయి. గత మూడేళ్లుగా వీళ్ల రేషన్ కార్డుల కోసం కాళ్లరిగేలా అధికారులు, ప్రజాప్రతినిధుల చుట్టూ ప్రదక్షిణలు చేస్తూనే వున్నా వీరి గోడు పట్టించుకొన్న వారు కాని, సమస్య పరిష్కరించిన అధికారిగానీ లేకుండా పోయారు. విసిగి వేసారిన గిరిజనులు ఇటీవల ఆర్డీఓ వెంకట రమణారెడ్డిని కలసి తమ గోడు వెళ్లబోసుకొన్నారు. దీనికి ఆర్డీఓ స్పందిస్తూ ప్రస్తుతం రేషన్‌కార్డులు కొత్తగా ఇవ్వడాన్ని తాత్కాలికంగా నిలుపుదల చేసి వున్నారని, ఆన్‌లైన్ వ్యవస్థ పని చేయడం ప్రారంభం కాగానే దరఖాస్తు చేసుకొంటే విచారించి తగిన న్యాయం చేస్తానని హామీ ఇచ్చారు.

# బ్రాందీ షాపు తొలగించాలని సిపిఐ ఆందోళన!

నిబంధనలకు విరుద్ధంగా ఏర్పాటు చేసిన మద్యం షాపు తొలగించాలంటూ గూడూరు పట్టణంలో సిపిఐ ఆందోళన చేపట్టింది. రెండో పట్టణ పరిధిలోగల రైల్వే అండర్ బ్రిడ్జి, జిఎస్ రాయులు కళ్యాణ మండపం వద్ద ఏర్పాటు చేసిన మద్యం దుకాణం వద్ద పార్టీ కార్యకర్తలు నిరసనకు దిగారు. ఈ సందర్భంగా సిపిఐ నేతలు మాట్లాడుతూ నిత్యం రద్దీగా వుండే రైల్వే అండర్ బ్రిడ్జి ప్రాంతంలో మద్యం దుకాణం ఏర్పాటు చేయడం సరికాదన్నారు. అందులోనూ ఆక్రమణ స్థలంలో నిర్మించిన భవనంలో బ్రాందీ షాపు ఏర్పాటుకు అధికారులు ఎలా అనుమతిస్తారని ప్రశ్నించారు. తక్షణం ఈ ప్రాంతంలో ఏర్పాటు చేసిన షాపును మరొక చోటకు తరలించాలని, లేదంటే ఆందోళన ఉధృతం చేస్తామని హెచ్చరించారు. అధికారుల తీరును నిరసిస్తూ రోడ్డుపై

## రైల్వే అండర్ బ్రిడ్జి వద్ద షాపు వద్దు

ఆందోళనకారులు బైఠాయించడంతో ట్రాఫిక్ స్తంభించిపోయింది. పోలీసులు జోక్యం చేసుకొని ఆందోళనకారులతో చర్చించి శాంతింపజేయడంతో ఆందోళనను విరమించారు. ఈ కార్యక్రమంలో సిపిఐ పట్టణ కార్యదర్శి సివిఆర్ కుమార్, నియోజకవర్గ ఇన్‌ఛార్జి ప్రభాకర్ తదితరులు పాల్గొన్నారు.

## • గూడూరు సొసైటీ

# ఉపాధ్యక్షునిపై అవిశ్వాసం

## సర్వత్రా చర్చనీయాంశం

గూడూరు ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘం ఉపాధ్యక్షుడిపై అవిశ్వాసం ప్రకటించి తొలగించడం చర్చనీయాంశమయ్యింది. అధ్యక్షునితో సహా 13 మంది సభ్యులు గల ఈ పరపతి సంఘంలో ఉపాధ్యక్షునిగా గ్రిద్దలూరు ముత్యాలయ్య వ్యవహరిస్తున్నారు. గత సీజన్‌లో చెన్నూరులో ధాన్యం కొనుగోలు కేంద్రాన్ని ప్రారంభించే విషయంలో ఉపాధ్యక్షుడికి, సిఇఓ నారాయణకు మధ్య వివాదం నెలకొనింది. ముత్యాలయ్య ఆశించిన స్థాయిలో పని తీరు కన్పరచకపోవడం ఇతరత్రా ఆరోపణలు, వివాదాలతో అవిశ్వాసాన్ని ఎదుర్కొన్నారు. 13 మందిలో 11 మంది సభ్యులు అవిశ్వాసానికి మద్దతు తెలపడంతో ముత్యాలయ్యను ఉపాధ్య పదవి నుంచి తొలగించి ఆయన స్థానంలో దేగపూడి కృష్ణారెడ్డిని ఎన్నుకొన్నారు.

# ముంగమూరు దాహార్తి తీరెదెన్నడు!

బోగోలు మండలం ముంగమూరు పంచాయతీలో త్రాగునీటి ఎద్దడి అధికంగా వుంది. పంచాయతీ పరిధిలోని వివిధ గ్రామాల ప్రజలు మంచినీటి సమస్యతో అల్లాడుతున్నారు. ఒకటి రెండు గ్రామాలలో ఓవర్ హెడ్ ట్యాంక్ ఏర్పాటుచేసి అక్కడ నుంచి పైపు లైన్ల ద్వారా మంచినీటి సరఫరాకు చర్యలు చేపట్టినా కాంట్రాక్టర్లు నాసిరకంగా వాటిని ఏర్పాటు చేయడంతో ఆయా గ్రామాలకు పైపుల ద్వారా చుక్కనీరు రాని పరిస్థితి ఏర్పడింది. ఇదే పంచాయతీ పరిధిలోని సాంబశివాపురం గ్రామంలో నాణ్యత పాటించకుండా ఓవర్ హెడ్ ట్యాంక్ నిర్మాణం

## ఏళ్లతరబడి ఇదే సమస్య

జరపడం, పైపులైన్లు నిర్మించడంతో వేసిన కొద్ది కాలానికే నిరుపయోగంగా మారాయి. మిగతా గ్రామాల పరిస్థితీ అంతే. దప్పిక తీర్చుకొనేందుకు గ్రామస్తులు నానా తంటాలు పడుతున్నారు. ఈ సమస్యపై ముంగమూరు ఉపసర్పంచ్ రాయి వినోద్ యాదవ్, స్థానిక కాంగ్రెస్‌నేత మార్టూరు రామచంద్రారెడ్డి, గుడిపల్లి రామకృష్ణ, కొండయ్య, తిరుపతి, రామ్మూర్తి తదితరులు ఇటీవల ఆర్డీఓ వెంకటరమణారెడ్డిని కలసి ప్రజలు ఎదుర్కొంటున్న మంచినీటి సమస్యను తెలిపి పరిష్కరించాల్సిందిగా విజ్ఞప్తి చేశారు.

## • గూడూరును అన్ని విధాల

# అభివృద్ధి చేస్తా!

## కొత్త ఛైర్మన్ దేవసేన ప్రతిన



గూడూరు మున్సిపాలిటీని అన్ని విధాల అభివృద్ధి చేస్తానని ప్రజలకు ఎల్లవేళలా అందుబాటులో వుంటానని కొత్తగా మున్సిపల్ ఛైర్మన్‌గా ఎన్నికైన పొణకా దేవసేన తెలిపారు. ఛైర్మన్‌గా ఎన్నికైన ఆమె జూలై 16న బాధ్యతలు చేపట్టారు. అనంతరం ఛైర్మన్ విలేకరులతో మాట్లాడుతూ పార్టీలు, రాజకీయాలనేవి ఎన్నికల వరకేనని, అభివృద్ధి పనుల్లో పార్టీలకు అతీతంగా పని చేస్తామన్నారు. 33 వార్డులలో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి తనవంతు కృషి చేస్తానని, కౌన్సిలర్ల అందరి సహకారంతో గూడూరు పట్టణాన్ని అభివృద్ధి చేస్తానని హామీ ఇచ్చారు. బాధ్యతలు చేపట్టడానికి ముందు అంబేద్కర్, మహాత్మాగాంధీ, పొట్టి శ్రీరాములు విగ్రహాలకు పూలమాలలు వేసి నివాళులర్పించారు. పలువురు కొత్త ఛైర్మన్‌ను అభినందించారు.




కీ॥శే॥ కలవకూరి వెంకటరెడ్డి గారు

సంస్మృతి

మా ఇంటి దివ్యజ్యోతి, మా ఆత్మబంధువు,
పేద ప్రజల జీవనజ్యోతి, ఈనాటి మా అభివృద్ధికి కారకుడు

కె.వి.ఆర్ గారి
(కలవకూరి వెంకటరెడ్డి)
39వ వర్ధంతి
(20.07.2014 తేది)

సందర్భంగా వారి పవిత్ర ఆత్మకు
శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

కె.వి.ఆర్ బ్రదర్స్ & సన్స్

# రంజాన్ నెలలో ఉపవాసాలతో వెనుకటి పాపాలన్నింటి నుంచి మన్నింపు!



ఇస్లాం ధర్మ మూల స్తంభాలలో నాల్గవది ఉపవాసం. ఖురాన్, హదీసుల ద్వారా, ఇజ్మాయె ఉమ్మత్ (తరతరాల ముస్లిం సమాజ ఏకాభిప్రాయం) ద్వారా రంజాన్ నెలలో ఉపవాసాలు పాటించడం విధి అని స్పష్టంగా చెప్పబడింది. అల్లానే ఇలా సెలవిచ్చారు.

"విశ్వాసులారా! ఉపవాసం మీకు విధిగా చేయబడింది. ఏవిధంగానైతే మీకు పూర్వం ప్రవక్తలను అనుసరించేవారికి విధించబడింది. దీని వల్ల మీరు అల్లాహ్‌కు భయపడతారని ఆశిస్తున్నానన్నారు.

## సకల శుభాల మాసం రంజాన్

దైవప్రవక్త మహమ్మద్ (సఅసం) ప్రవచిస్తూ మీపై ఒక శుభప్రదమైన నెల అవతరించనున్నది. ఆ నెలలో ఉపవాసం పాటించడాన్ని దేవుడు మీకు విధిగా చేసాడు. ఆ నెలలో స్వర్గద్వారాలు తెరువబడతాయి. నరక ద్వారాలు మూసి వేయబడతాయి. వేయి నెలల కంటే ఘనమైన రేయి ఒకటి ఈ నెలలోనే ఉంది. దాని శుభాలను కోల్పోయినవాడు దురదృష్టవంతుడన్నారు.

మరో శుభప్రదమైన హదీసులో 'అల్లా' సైతం ఇలా చెప్పారు. మనిషి చేసే ఆచరణలన్నీ తన స్వయానికి సంబంధించినవే. ఒక్క ఉపవాసం మినహా. ఎందుకంటే ఈ ఆచరణ (ఉపవాసం) నాది. స్వయంగా నేనే దానికి ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాను. ఉపవాసం పాపాల నుంచి రక్షించే డాలు వంటిది. ఉపవాసానికి రెండు ఆనంద ఘడియలున్నాయి. ఒకటి ఇఫ్తార్ (ఉపవాస విరమణ వేళ). రెండోది తను అల్లా సన్నిధికి చేరి తన పుణ్యఫలాల చిట్టా చూసుకొన్నప్పుడు పొందే ఆనందం.

దైవప్రవక్త మహమ్మద్ (సఅసం) ఈ విధంగా చెప్పారు. ఎవరైతే దేవునిపై సంపూర్ణ విశ్వాసంతో, పుణ్యాన్ని ఆశిస్తూ రంజాన్ నెల ఉపవాసాలు పాటిస్తారో వారి వెనుకటి పాపాలన్నీ మన్నించబడతాయి.

## ఉపవాసం సంకల్పం

రోజా (ఉపవాసం) ఉండేవారు ఉపవాసముంటున్నానని ఉషోదయానికి ముందే సంకల్పం చేసుకోవాలి. సంకల్పం అంటే మనసులో తలచుకోవడమే. ఉషోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఉపవాసాన్ని భంగపరిచే విషయాలు (తినటం, త్రాగడం, సంభోగించటం లాంటి వాటికి) దూరంగా వుండాలి.

## బాలింతలకు ఉపవాసం విధి కాదు

వయోజనులు, ఆరోగ్యవంతులైన ప్రతి ముస్లిం, స్త్రీ పురుషులపై ఉపవాసం విధిగా నిర్ణయించబడింది. యుక్తవయసుకు చేరని పిల్లలు, ఉన్మాదులు, రోగగ్రస్తులు, ప్రయాణీకులు, రుతుస్రావం, పురిటి రక్తస్రావానికిలోనై వున్న స్త్రీలకు, కురువృద్ధులైన స్త్రీ, పురుషులకు, గర్భిణులు, బాలింతలకు ఉపవాసం విధి కాదు.

## ఉపవాసానికి బదలు ఫిద్‌యా!

వృద్ధాప్యం మరీ ఎక్కువైన స్త్రీ, పురుషులకు కోలుకోలేని వ్యాధిగ్రస్తులకు ఉపవాస విధి నుండి మినహాయింపు ఉంది. ఇలాంటివారు ఉపవాసానికి బదలు తప్పనిసరిగా 'ఫిద్‌యా' ఇవ్వాలి. అంటే ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం ఒక నిరుపేదకు కడుపు నిండా అన్నం పెట్టాలి.

## ఉపవాసం నిషిద్ధం

రంజాన్, బక్రీద్ పండుగలనాడు ఉపవాసం పాటించడం నిషిద్ధం. ఇస్లామియా క్యాలెండర్ ప్రకారం జిల్ హిజ్జా మాసపు పదకొండు, పన్నెండు, పదమూడు తారీఖుల్లో ఉపవాసం పాటించడం నిషిద్ధం. రంజాన్ నెలలో తప్ప మిగతా నెలల్లో నిరంతరాయంగా ఉపవాసాలు పాటించడం నిషిద్ధం.

## సంవత్సరమంతా ఉపవాసాలు ఉన్నట్లే!

రంజాన్ తర్వాత వచ్చే షవ్వాల్ నెలలో వరుసగా ఆరు రోజులపాటు ఉపవాసాలు పాటిస్తే సంవత్సరమంతా ఉపవాసాలు పాటించినట్లేనని దైవప్రవక్త మహమ్మద్ (సఅసం) స్పష్టం చేశారు.

## ఖురాన్ పారాయణం

దైవప్రవక్త మహమ్మద్ (సఅసం) రంజాన్ మాసంలో అందరికన్నా ఎక్కువగా దానధర్మాలు చేసేవారు. ప్రతిరోజూ రాత్రి జిబ్రయీల్ దూతకు ఖురాన్ పారాయణం చేసి వినిపించేవారు. జిబ్రయీల్ అలైహి సల్లం కూడా ఆయనకు ఖురాన్

అల్లూరు రహీం

వినిపించేవారు. రంజాన్ మాసపు చివరి దశకం ప్రారంభం కాగానే దైవప్రవక్త మహమ్మద్ (సఅసం) రాత్రివేళల్లో స్వయంగా మేల్కొనటమే గాకుండా, తమ ఇంటి వారిని కూడా మేల్కొలిపేవారు. ఆ సమయాల్లో మరింత శ్రమించి దైవారాధన చేసేవారు.

## రంజాన్‌లో ఘనమైన రాత్రి!

లైలతుల్ ఖద్ర్ అంటే ఘనమైన రాత్రి అని అర్థం. రంజాన్ మాసంలోని చివరి పదిరోజుల్లోని ఐదు బేసి రాత్రుల్లో ఏదో ఒక దాన్ని ఇస్లామియా షరీయత్ ప్రకారం 'లైలతుల్ ఖద్ర్' అంటారు. ఈ రాత్రి చేసే ఆరాధన వెయ్యి నెలలపాటు (అంటే దాదాపు 83ఏళ్ల కంటే ఎక్కువ కాలం) చేసే ఆరాధన కన్నా ఉత్తమమైనదని స్వయంగా అల్లానే చెప్పడం విశేషం.

ఈ ఐదు రాత్రుల్లోనూ ప్రజలు జాగారం చేసి దైవారాధన, మన్నింపు, ప్రార్థనలు, ఖురాన్ పారాయణాలు చేస్తూ గడపాలి. లైలతుల్ ఖద్ర్ రాత్రి ఈ దువా పఠించాలి.

"అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ మహిబ్బుత్ ఆఫ్ వ ఫావు అన్నీ" (అల్లా నీవు అమితంగా మన్నించేవాడవు. మన్నించడానికి యిష్టపడతావు. కనుక నన్ను మన్నించు)

## తరావీహ్ నమాజ్

తరావీహ్ నమాజ్ రంజాన్ మాసంలో రాత్రి వేళల్లో సామూహికంగా చేయబడుతుంది. తహజ్జుద్ నమాజుకు మరో రూపమే తరావీహ్ నమాజు. ఈ రెండు వేర్వేరు నమాజులు కావు. సాధారణంగా రాత్రి చివరి భాగంలో నిద్ర మేల్కొని చేసే నమాజుని తహజ్జుద్ అనీ, రంజాన్ మాసంలో నిద్ర పోక ముందు ఇషా (8.30 గంటల) నమాజు పూర్తయ్యాక చేసే నమాజుని 'తరావీహ్' అంటారు.

రంజాన్ మాసంలో ప్రజలు పగలంతా ఉపవాసం ఉండి సాయంత్రానికి అలసిపోతారు. ఒంట్లో సత్తువ తగ్గుతుంది. ఇఫ్తార్, మగ్రిబ్, ఇషా నమాజుల తర్వాత నిద్రపోయి తిరిగి అర్ధరాత్రి మేల్కొని సుదీర్ఘ నమాజు చేయటం, ఆ తర్వాత వెంటనే మరుసటి రోజు ఉపవాసానికి ఉపక్రమించడం భారంగా ఉంటుంది. అందుకని కారుణ్య ప్రవక్త మహమ్మద్ (సఅసం) రంజాన్ మాసంలో రాత్రి నమాజు (తహజ్జుద్)ను ఇషా తర్వాత వెంటనే చేసి ప్రజలను ఇబ్బందుల నుంచి కాపాడారు. తరావీహ్ నమాజ్‌ను నెల్లూరులో 20 రకాతులు చదువుతారు. కాని ప్రామాణిక హదీసులన్నీ దైవప్రవక్త మహమ్మద్ (సఅసం) తరావీహ్ నమాజు 8 రకాతులు చేసేవారని చెబుతున్నాయి. ఈ విషయమై వివాదం అనవసరమని దైవప్రవక్త సతీమణి ఆయిషా (రజి అన్‌హా) స్పష్టం చేయడం విశేషం.

● మంత్రి నారాయణ జోక్యంతోనే...

# జిప ఎన్నిక ప్రతిష్టాత్మకంగా మారింది!

## 20 తేదీ అయినా సజావుగా జరిగితే చాలు

నెల్లూరు జిల్లా పరిషత్ ఎన్నిక మరొకసారి వాయిదా పడింది. రేపు ఆదివారం (20తేది) మళ్లీ ఎన్నిక సమావేశం జరగనున్నది. రాజు తలచుకొంటే దెబ్బలకు కొదవ వుండదన్నట్లు, అధికార పార్టీ పట్టుపడితే స్థానిక సంస్థల పెత్తనం ఎంత అరాచకీయంగా మారుతుందో అర్థం చేసుకోవడానికి జిప ఎన్నిక తీరే ఒక ఉదాహరణ.

జిపలో తెలుగుదేశానికి ఉన్నది కేవలం 15 మంది జడ్పీటిసి సభ్యులు మాత్రమే. జగన్ పార్టీకి 31 మంది ఉన్నారు. మామూలుగా అయితే ఛైర్మన్ పదవికి తెలుగుదేశం పోటీ పడేది కాదు. కానీ ఇప్పుడు అది అధికార పార్టీ. దానితో ఎట్లయినా జిపను దక్కించుకోవాలని తన శక్తి యుక్తులన్నీ ప్రదర్శిస్తున్నది. అధికార పార్టీ వద్ద అయస్కాంతాలు జాస్తిగా ఉండడం సహజం. వాటిని వాడి దాదాపు ఏడుమంది జగన్ పార్టీ జడ్పీటిసిలను తమ వైపు ఆకర్షించుకొన్నారు. అయినా మెజార్టీకి ఒక రెండు ఓట్లు తక్కువ. జగన్ పార్టీ నేతలు కూడా మొండిగా వ్యవహరిస్తున్నారు. ఎట్టి పరిస్థితులలోనూ జిప తమ చేజారకుండా చూసుకోవడానికి తమ శక్తినంతా ధార పోస్తున్నారు. వారి ఛైర్మన్ అభ్యర్థి బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి బాగా స్థితిపరుడు. డబ్బు లెక్క లేదు. దానితో ఖర్చుకు వెరవకుండా రెండు నెలల నుంచి తన జడ్పీటిసి సభ్యులను ఇంటి అల్లుళ్ల వలే లాలిస్తున్నాడు. విహార యాత్రల పేరిట దేశమంతా తిప్పుతున్నాడు. కోరిన గొంతెమ్మ కోరికలన్నీ తీరుస్తున్నాడు. అన్నిటికంటే ముఖ్యంగా తన వారెవరూ తెలుగు దేశంతో మాట కలపకుండా కోడి తన పిల్లలను రెక్కల క్రింద దాచుకొన్నంత జాగ్రత్తగా కాపాడుకొంటున్నాడు.

తెలుగుదేశం కూడా అంతే మొండిగా వుంది. జగన్ శిబిరంలో ఉన్న వారిని నయాన భయాన తన వైపుకు తిప్పుకోవడానికి పోలీసు బలగాన్ని కూడా కూడా ప్రయోగిస్తున్నది. కావలి జడ్పీటిసి సభ్యురాలి విషయంలో ఈ మందు పని చేసింది. ఇడుపులపాయలో, శత్రు దుర్భేద్యమైన జగన్ కోటలో వుండిన ఆమెను, ఆమె స్వంత బంధువుల ద్వారానే పోలీసు చేతికి అప్పచెప్పి, మచ్చిక చేసుకొన్నారు. జగన్ స్వయంగా తన చేతిలో బైబిల్ పెట్టి, ప్రమాణం చేయించుకొన్నాడని కొంత మొగమాట పడిందట కావలి జడ్పీటిసి సభ్యురాలు. అయితే స్వంత బంధువుల ఒత్తిడితో తెలుగుదేశానికి రాక తప్పలేదు.

ఇప్పుడు అందరి దృష్టి ఇందుకూరుపేట సభ్యుడి మీద ఉంది. ఆయనకూ తెలుగుదేశం గాలం వేసింది. అయితే జగన్ పార్టీ నేతలు అతడిని దాచిపెట్టేశారు. తమ శిబిరంలో కూడా లేకుండా చేశారు. హైకోర్టులో దీనిపై హెబియస్ కార్పస్ పిటీషన్ దాఖలై వుంది. 20 తేది ఎన్నిక సమయానికి అతడిని నేరుగా ఎన్నిక సమావేశానికి తీసుక వస్తారని చెప్తున్నారు. కానీ ఈలోగానే అతనిని చేజిక్కించుకోవాలని పోలీసు ప్రయత్నం చేస్తున్నది. ఏమౌతుందో వెండి తెర మీద వేచి చూద్దాం.

ఇప్పటివరకు లెక్క చూస్తే తెలుగుదేశం, జగన్ కూటముల వద్ద చెరి 23 మంది వున్నారు. ఇందుకూరుపేట జడ్పీటిసి సభ్యుడు ఎటు మొగ్గితే అటు

కొరవ 14వ పేజీలో






# వారఫలాలు

### గ్రహ సంచారం

*19.07.2014 నుంచి 25.07.2014 వరకు మిధునంలో శుక్రుడు, బుధుడు, కర్కాటకంలో రవి, గురులు, కుజుడు శని తులలో, రాహువు కన్యలో, కేతువు మీనంలో ఉండగా, చంద్రుడు మేషం నుంచి మిధునం వరకు 3 రాశులలో సంచారం.*

### ముఖ్య దినాలు

21తేది ఆఢికృత్తిక.
22తేది కామికా ఏకాదశి.
25తేది మాసశివరాత్రి.

### సాధారణ శుభ సమయాలు

**భారత్‌లో** 19 శని ఉ7.47 నుంచి 9.53 వరకు మళ్లీ రా7.21 నుంచి 8.23 వరకు.

**న్యూయార్క్‌లో** 19 శని ఉ8.05 నుంచి 9.50 వరకు మాత్రమే.

**లాస్‌ఏంజిల్స్‌లో** 19 శని ఉ8.12 నుంచి 10.35 వరకు, 21 సోమవారం రా7.39 నుంచి 9.16 వరకు.

**లండన్‌లో** 19 శని ఉ7.48 నుంచి 10.38 వరకు మళ్లీ రా8.48 నుంచి 10.05 వరకు.

**పాఠకులకు ముఖ్య గమనిక** – ఈ నెల 14 నుంచి సెప్టెంబరు 4 వరకు తులారాశిలో కుజగ్రహం, శని గ్రహం కలయిక జరుగుతున్నది. కనుక సెప్టెంబరు 4 వరకు మేషరాశి వారు భార్యాస్థానంలోను, వృషభ రాశి వారు ఋణ, శత్రు, ఆరోగ్య విషయాలలోను, మిధునరాశి వారు సంతాన అంశాలలోను, కర్కాటక రాశి వారు వృత్తి, వ్యాపార, ఉద్యోగ, ఆరోగ్య, వాహన, గృహ, మాతృ స్థితిగతులలోను, సింహ రాశి వారు సోదర లేక సోదరీ అంశాలలోను, కన్యా రాశి వారు ఆర్థిక, కుటుంబ, నేత్ర, దంత స్థితుల లోను, వృశ్చికరాశి వారు ఖర్చు విషయంలోను, ధనూరాశి జాతకులు లబ్ది కావల్సి ఉన్న అంశాల లోను, మకరరాశి జాతకులు సకల వ్యవహారాల లోను, కుంభరాశి వారు పితృసంబంధిత వ్యవహా రాలలోను, మీనరాశి జాతకులు ఆరోగ్య, ప్రయాణ, వాహనచోదక అంశాలలోను పలు జాగ్రత్తలు తీసు కుంటూ అనవసర శ్రమకు గురికాకుండా పట్టువిడు పులు తెలుసుకుంటూ ముందుకు వెళ్లాల్సిన అవ సరం ఎంతైనా ఉంది. భయం, ఆందోళన వదిలి వారి వారి ఇష్టదైవాలను ప్రార్థిస్తూ సర్వం శుభ కరంగా ఉండాలని కోరుకుంటూ ఉండాలి.



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

సోదర సంఘీభావంచే నూతన కార్యాలలో ముందంజ. గర్భి ణులకు శుభవార్తలు. విమర్శలకు ధీటుగా సమాధానమిస్తారు. ముఖ్య ప్రయాణాలు వాయిదా. ఋణ సమస్యలు స్వల్పంగా పెరుగుతాయి. కళత్రంతో స్వల్పంగా మనస్పర్థలు. శత్రు నిర్ణయాలచే భయముం డదు. విధానమార్పులచే విజయం. 20వతేదీన సాహస కృత్యాలకు ప్రాధాన్యత ఇవ్వవద్దు. ఆదివారం సాయంత్రం రాహుకాలంలో మౌనం పాటించి, రాత్రి సమయంలో సాత్వికాహారం తీసుకొనండి. అసత్యారోపణలు వద్దు. 25 శుక్రవారం నాడు హమీ సంతకాలు చేయవద్దు. సంతాన విషయాలలో త్వరపడి నిర్ణయాలు తీసుకోవద్దు. అధికారుల వద్ద సంయమనంతో ఉండాలి. అశ్వని జాతకులు జూలై 25 మధ్యాహ్నం 12.26 నుంచి మరుసటి రోజు మధ్యాహ్నం 3.10 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలని గమనించాలి. భరణి, కృత్తిక నక్ష త్రాలకు ఈ వారం విసర్జనీయ సమయములు లేవు.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఉద్యోగ వ్యాపారాదులలో నూతన ఆలోచనలచే లబ్ది. భాగ స్వామ్య చర్చలు నెరవేరుతాయి. సంతాన విషయాలలో నిర్ణయాలు కాలయాపన వద్దు. తోబుట్టువుల మధ్య స్వల్ప భేదాభిప్రాయాలు. వాస్తవ అంశాలను గోప్యంగా ఉంచగలరు. స్పెక్యులేషన్ యోగ వంతం కాదు. వృధా ప్రయాణాలున్ననూ మనశ్శాంతి ఉంటుంది. గౌరవప్రతిష్ఠలు పెరుగుతాయి. స్నేహితులతో పంతాలకు వెళ్లవద్దు. ఉదరలోపంచే వైద్య సలహాలు తీసుకోవాలి. 20వతేది పులుపును స్వీకరించవద్దు. గురు వారం నాడు భోజనంలో తీపిని తీసుకొనండి. బంధువర్గంతో అనవసర విభేదాలు వద్దు. 22న సమయస్ఫూర్తి, సంయమనంతో ఆలోచించి వ్యవహరించండి. రోహిణి జాతకులు జూలై 19 ఉదయం నుంచి ఆ రోజు అర్ధరాత్రి 3.42 వరకు, మృగశిర జాతకులు 19 అర్ధరాత్రి 3.42 నుంచి 20 అర్ధరాత్రి 4.31 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి. కృత్తిక 2,3,4 జాతకులకు వ్యతిరేక సమయములు లేవు.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

వృత్తి ఉద్యోగ వ్యవహారాలలో కట్టుదిట్టంగా ఉండండి. ఉన్నత వ్యక్తుల పరిచయంతో ఉత్సాహంగా ఉంటారు. స్పెక్యులేషన్ స్వల్ప లాభదాయకం. శుభచర్చలు వాయిదా పడును. మనోనిబ్బరంతో ప్రయత్నిస్తే విజయప్రాప్తికి సూచన. సంతాన అంశాలపై దృష్టి సారించాలి. వ్యక్తిగత విమర్శలు వద్దు. చంచలత్వం తగ్గుతుంది. కళత్రభోగం పరిఢవిల్లును. 21వ తేది నీలం రంగు దుస్తులు ధరిం చండి. ఎదుటివారిని గుడ్డిగా నమ్మవద్దు. భాగస్వామ్య చర్చలలో ముఖ్య నిర్ణయాలను రహస్యంగా ఉంచాలి. 23 బుధవారం నాడు ఆచితూచి మాట్లాడాలి. దైవకార్యాచర ణపై ఆసక్తి చూపండి. మృగశిర 3,4 నక్షత్ర జాతకులు 19 అర్ధరాత్రి 3.42 నుంచి 20 అర్ధరాత్రి 4.31 వరకు, ఆర్ద్ర జాతకులు 20 అర్ధరాత్రి 4.31 నుంచి 22 ఉదయం 5.53 వరకు, పునర్వసు 1,2,3 జాతకులు జూలై 22 ఉదయం 5.53 నుంచి 23 ఉదయం 7.43 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ఉద్యోగ అంశాలలో సంజాయిషీలుంటాయి. భేషజాలకు వెళ్ల వద్దు. శాంత స్వభావంతోనే అనుకూలతలు ఉంటాయి. ఆరోగ్య అంశాలలో వైద్యసలహాలను స్వీకరించాలి. స్త్రీలకు యోగవంతం. స్పెక్యులేషన్‌లో హడావుడి నిర్ణయాలు వద్దు. బంధుప్రీతి మెండుగా ఉంటుంది. వాహనచోదకులు జాగ్రత్త వహించాలి. నూతన మార్పు పథకాలను అన్వేషిస్తారు. భాగస్వామ్య వ్యవహారాలలో కీలకంగా వ్యవహరించాలి. నిర్భీతిగా వ్యవహరిస్తారు. అసత్య సంభాషణలచే సమస్యలు వస్తాయి. శనివారం నాడు ఎరుపురంగు దుస్తులను ధరించవద్దు. ఎదుటివారిపై ఆగ్రహావేశాలకు వెళ్లవద్దు. పునర్వసు 4వపాద జాతకులు జూలై 22 ఉదయం 5.53 నుంచి 23 ఉదయం 7.43 వరకు, పుష్యమి వారు 23 ఉదయం 7.43 నుంచి 24 ఉదయం 9.56 వరకు, ఆశ్లేష వారు 24 ఉదయం 9.56 నుంచి 25 మధ్యాహ్నం 12.26 వరకు వ్యతిరేక సమయములని భావించాలి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

శుభచర్చలలో పాల్గొని పితృవర్గం వారిని సంతోషపెడతారు. వ్యాపారులు శీఘ్రనిర్ణయాలు వద్దు. 23, 24 తేదీలలో సోమరిత నాన్ని విడనాడాలి. న్యాయ లావాదేవీలలో జాప్యం జరుగుతుంది. సోదర, సోదరీ అంశాలలో సంయమనంతో వ్యవహరించాలి. స్థిర ఆదాయం ఉంటుంది. కార్యసిద్ధికై ఖర్చు పెడతారు. స్పెక్యులేషన్‌లో గెలుపు తక్కువ. వృధా ప్రయాణాలుంటాయి. భాగస్వామ్య చిక్కు లున్ననూ లెక్కచేయరు. సంతానానికి విజయప్రాప్తి. గృహనిర్మాణంలో ఆటంకాలుం టాయి. వ్యూహాత్మక శక్తిని పెంచుతారు. 19వతేదీ మధ్యాహ్నం తీపిని స్వీకరించవద్దు. నూతన ప్రణాళికారచనలో సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. శుక్రవారం నాడు తెలుపురంగు దుస్తులను ధరించవద్దు. మఖ జాతకులు 25 మధ్యాహ్నం 12.26 నుంచి తదుపరి రోజు మధ్యాహ్నం 3.10 వరకు అనుకూల సమయం కాదని గ్రహించాలి. పుబ్బ జాతకులు మరియు ఉత్తర 1వపాదం వారికి ప్రతికూల సమయాలు లేవు.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

శుభకార్య సంకేతాలకై వేచి ఉంటారు. పాలనాపర శక్తియుక్తులు పెంచుతారు. ఆధ్మాత్మిక విషయాలలో పాల్గొంటారు. కళారంగాల వారికి ప్రోత్సాహం. ఆర్థిక లావాదేవీలు, ఆరోగ్య అంశాలలో శ్రద్ధ అవసరం. పితృనిర్ణయాలపై ఆసక్తి. అకాలభోజనాలున్నాయి. సోదర అంశాలు మెరుగుపడతాయి. జాయింట్ వ్యాపారంలో ఆదాయానికి గండి. సంతాన శుభకార్య చర్చలు సఫలం. వ్యక్తిత్వ లోపాలను కప్పిపుచ్చుకుంటారు. కృతనిశ్చయం బలంగా ఉంటుంది. ధైర్య సాహసాలతో శత్రు జయం. రహస్య చర్చలు అధికంగా ఉంటాయి. స్వీయకల్పనాశక్తి పెరుగుతుంది. శుక్ర వారం రాహుకాలంలో మౌనం వహించండి, ఈరోజు నూతన వ్యాపార నిర్ణయాలు చేయవద్దు. 20వతేది మధ్యాహ్న ప్రయాణంలో జాగ్రత్త తీసుకుంటూ, వ్యవహారశైలిలో మార్పులవసరం. ఉత్తర 2,3,4, హస్త, చిత్ర 1,2 జాతకులు జూలై 19 ఉదయం నుంచి 21 ఉదయం 10.51 వరకు ప్రతికూల సమయమని భావించాలి.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

వ్యూహాత్మక అంశాలు ఛేదిస్తారు. స్థానచలన సూచన కలదు. ఆగ్రహావేశాలు తగ్గుతాయి. సమయస్ఫూర్తితో ఋణభారం తగ్గిస్తారు. గృహనిర్మాణంపై చర్చలు, ఆశాజనక పరిస్థితులుంటాయి. భాగస్వామ్య నిర్ణయాలు విజయపంథాలో ఉంటాయి. ప్రయాణాలలో రాజీధోరణిని అవలంబించాలి. పాతమిత్రత్వం తిరిగి ప్రారంభం. ఉద్యోగంలో నాయ నిర్ణయాలవసరం. కళత్ర సలహాలను స్వీకరించలేరు. స్త్రీలకు దీర్ఘకాల సమస్య తగ్గుతుంది. ఆందోళన, విసుగు ఉన్నా ధైర్యంగా ఉంటారు. పితృఅంశ నిర్ణయాలపై పునరాలోచించాలి. 21న వాగ్దానాలు భంగం కాకుండా జాగ్రత్తపడాలి. మంగళవారం పగటి నిద్ర వద్దు. చిత్త 3,4 పాద జాతకులు జూలై 19 అర్ధరాత్రి 3.42 నుంచి 20 అర్ధ రాత్రి 4.31 వరకు, తిరిగి 21 ఉదయం 10.51 నుంచి 23 రాత్రి 8.49 వరకు, స్వాతి నక్షత్ర జాతకులు 20 అర్ధరాత్రి 4.31 నుంచి 23 రాత్రి 8.49 వరకు, విశాఖ 1,2,3 పాద జాత కులు 21 ఉదయం 10.51 నుంచి 23 రాత్రి 8.49 వరకు వ్యతిరేకసమయమని గ్రహించాలి.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ

ఆర్థిక అంశాలలో ఇతరులకు హామీలుండవద్దు. అంతర్గత అం శాలు బహిర్గతం చేయడంతో విమర్శలు పెరుగుతాయి. సంయమ నం, సమయస్ఫూర్తితో ఉండాలి. న్యాయ లావాదేవీలు అనుకూలం. తెరచాటు వ్యవహారాలు కనిపెడతారు. ప్రతిభకు రాణింపు కలదు. వృత్తి వ్యాపారాలలో సరిక్రొత్త నిర్ణయాలు చేస్తారు. శ్వాసకోశ రుగ్మ తలున్నాయి. సంతాన అంశాలలో అభివృద్ధి. స్వయంవృత్తుల వారికి పెట్టుబడి లభిస్తుంది. గృహనిర్మాణ ఆలోచనలు సడలుతాయి. గురువారం నాడు హస్య సంభాషణలు చేయవద్దు. 22,23 తేదీలలో రాత్రివేళ పెందలకడనే భోజనం ముగిం చండి. సోమవారం రాత్రి ఆకుపచ్చ దుస్తులు ధరించవద్దు. విశాఖ 4వపాద జాత కులు 22 ఉదయం 5.53 నుంచి 23 ఉదయం 7.43 వరకు తిరిగి 23 రాత్రి 8.49 నుంచి మరుసటి రోజు ఉదయం 8.29 వరకు, అనూరాధ, జ్యేష్ఠ వారు 23 ఉదయం 7.43 నుంచి మరుసటిరోజు ఉదయం 8.29 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వృత్తి ఉద్యోగ వ్యాపారాలలో పుంజుకుంటారు. కుటుంబశాంతి లభిస్తుంది. స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. ముక్కుసూటిగా మాట్లాడి నందున ఎదుటివారి నుంచి సమస్యలు. అసౌకర్యాలతో విసుగు అధికం. ఆశ్రిత పక్షపాతం పెరుగును. స్థానచలన అవకాశాలు లేవు. స్వవృత్తుల వారికి ఆశాజనకం. వారాంతంలో సృజనాత్మక శక్తి తగ్గును. ముఖ్య కారణాలచే ప్రయాణం వాయిదా. మంగళవారం నాడు ముఖ్య విషయాలను మర్చిపోకండి. నీలం రంగు దుస్తులు ధరించకుండా ఉం డండి. సంతాన విషయాలలో అధికశ్రద్ధ వహించండి. స్థిరాలోచనలకై దృష్టి పెట్టండి. 25 శుక్రవారం నాడు నూతన వస్తు కొనుగోలును వాయిదా వేయండి. మూల జాత కులు జూలై 25 మధ్యాహ్నం 12.26 నుంచి మరుసటి రోజు మధ్యాహ్నం 3.10 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి. పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వపాదం వారికి ప్రతికూల సమయాలు లేవు.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

విధినిర్వహణలో స్వల్ప పొరపాట్లు జరుగును. జీవనోపాధిలో నిదానంగా స్థిరత్వమేర్పడును. అనవసర కలహం తెచ్చే వ్యక్తులపై సంయమనం పాటించండి. కళత్ర అంశాలలో నూతన నిర్ణయాలు ఫలిస్తాయి. మాతృవర్గీయులచే లబ్ది. కీర్తి ప్రతిష్టలు పెరుగును. నూతన ప్రణాళికలు తారుమారు కాగల సూచన. శత్రువిజృంభణచే అశాంతి ఉన్ననూ ధైర్యంతో కొనసాగుతారు. గుప్త సమాచారాన్ని సేకరిస్తారు. ఆర్థికమాంద్యం ఉండదు. ప్రయాణాలు లాభించును. శుక్ర, శనివారా లలో వాతరోగబాధలకై వైద్యసేవలు తీసుకోవాలి. 24న ఇతరులపై దూషణలు వద్దు. మధ్యాహ్న భోజనంలో పెరుగు తప్పక తినండి. శ్రవణా నక్షత్ర జాతకులు జూలై 19 ఉదయం నుంచి ఆ రోజు అర్ధరాత్రి 3.42 వరకు, ధనిష్ఠ 1,2 పాద జాతకులు 19 అర్ధరాత్రి 3.42 నుంచి 20 అర్ధరాత్రి 4.31 వరకు ప్రతికూల సమయమని భావిం చాలి. ఉత్తరాషాఢ 1,2 వారికి వ్యతిరేక సమయాలు లేవు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

పారిశ్రామికులకు విజయవార్తలు. స్థిరలావాదేవీలలో లోపాలు సరిచేస్తారు. ముఖ్య విషయాలలో హామీలు తీసుకుంటారు. మేధా శక్తితో నూతన మార్గాలన్వేషిస్తారు. ఉద్యోగ నిర్వహణలో ఉన్నతి కలుగును. నిత్య దినచర్యలో తరచూ మార్పులు. వారప్రారంభంలో శరీర శ్రమ అధికం. ఆరోగ్య విషయంలో వైద్య సలహాలచే సంతృప్తి. స్నేహిత బాధ్యతను స్వీకరించలేరు. కుటుంబ కలతలచే కొంత అశాంతి. వారప్రారంభంలో శరీర శ్రమ అధికం. గురువారం నాడు స్పెక్యులేషన్‌కు దూరంగా ఉండండి. ఏ విషయంలోనూ కలహాలు వద్దు. 19వ తేదీ తెలుపురంగు దుస్తులు ధరించవద్దు. పితృఅంశాలపై శ్రద్ధ చూపండి. ధనిష్ఠ 3,4 నక్షత్ర జాతకులకు జూలై 19 అర్ధరాత్రి 3.42 నుంచి 20 అర్ధరాత్రి 4.31 వరకు, శతభిషం జాతకులకు 20 అర్ధరాత్రి 4.31 నుంచి 22 ఉదయం 5.53 వరకు, పూర్వాభాద్ర 1,2,3 పాద జాత కులకు 22 ఉదయం 5.53 నుంచి 23 ఉదయం 7.43 వరకు వ్యతిరేకసమయాలు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

నూతన అగ్రిమెంట్లు ఫలిస్తాయి. సాహస నిర్ణయాలపై దృష్టి సారిస్తారు. జీవనభీతి తగ్గును. భూ, గృహ, ధన అంశాలలో లబ్ది. వాహనచోదకంలో జాగ్రత్త వహించాలి. మంగళవారం నాడు సాయంత్రం సాత్వికాహారం తీసుకొనండి. వాస్తవ అంశాలలో గోప్యత పాటిస్తారు. శరీరతేజస్సు పెరుగును. గృహవాతావరణం ఆశాజనకం. కళత్రంచే ఖర్చులధికం. మనోసంకటాలు వదిలేస్తారు. శీఘ్ర నిర్ణయాలుండవు. ప్రత్యేక ప్రతిపత్తిని ఆశిస్తారు. 23న మేధాశక్తితో సమస్యలు పరిష్కరించాలి. సహ ఉద్యోగులతో సంయమనం పాటించండి. రాత్రి భోజనంలో పెరుగు తీసుకోవద్దు. పూర్వాభాద్ర 4వపాద జాతకులు జూలై 22 ఉదయం 5.53 నుంచి 23 ఉదయం 7.43 వరకు, ఉత్తరాభాద్ర వారు 23 ఉదయం 7.43 నుంచి 24 ఉదయం 9.56 వరకు, రేవతి వారు 24 ఉదయం 9.56 నుంచి 25 మధ్యా హ్నం 12.26 వరకు వ్యతిరేక సమయాలని గ్రహించాలి.

## పంచాంగం

### జూలై తిథులు
### ఆషాఢ బహుళ

**19 శని** అష్టమి: రా7.20; అశ్వని: రా3.42; వర్జ్యం: రా11.40–1.17; దుర్ము: ఉ5.48–7.31.

**20 ఆది** నవమి: రా7.13; భరణి: తె4.31; వర్జ్యం: మ1.38–3.17; దుర్ము: సా4.57–5.48.

**21 సోమ** దశమి: రా7.42; కృత్తిక: పూర్తిగా; వర్జ్యం: సా5.12–6.53; దుర్ము: మ12.40–1.31, మ3.14–4.05.

**22 మంగళ** ఏకాదశి: రా8.42; కృత్తిక: ఉ5.53; వర్జ్యం: రా11.07–12.50; దుర్ము: ఉ8.23–9.14, రా11.07–11.52.

**23 బుధ** ద్వాదశి: రా10.08; రోహిణి:ఉ7.43; వర్జ్యం: మ1.50–3.35; దుర్ము: మ11.48–12.40.

**24 గురు** త్రయోదశి: రా11.55; మృగశిర: ఉ9.56; వర్జ్యం: రా7.13–8.59; దుర్ము: ఉ10.06–10.57, మ3.13–4.05.

**25 శుక్ర** చతుర్దశి: రా1.57; ఆర్ద్ర: మ12.26; వర్జ్యం: రా1.48–3.35; దుర్ము: ఉ8.23–9.15; మ12.40–1.31.

**దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ**
ఫ్లాట్ నెం.149, రోడ్ నెం.11,
అలకాపురి, రంగారెడ్డిజిల్లా. హైదరాబాద్.
సెల్: 9348032385, 9348632385

## 2014 నెల్లూరు సిటీ నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 1 | ఐటిఐ, కోవూరు | 786 | 446 | 291 | 28 |
| 2 | ఐటిఐ, కోవూరు | 812 | 528 | 242 | 17 |
| 3 | వెంకటేశ్వరపురం | 826 | 557 | 201 | 11 |
| 4 | వెంకటేశ్వరపురం | 784 | 565 | 109 | 10 |
| 5 | వెంకటేశ్వరపురం | 455 | 294 | 116 | 10 |
| 6 | వెంకటేశ్వరపురం | 849 | 603 | 173 | 13 |
| 7 | వెంకటేశ్వరపురం | 875 | 565 | 248 | 9 |
| 8 | వెంకటేశ్వరపురం | 589 | 389 | 176 | 7 |
| 8ఎ | వెంకటేశ్వరపురం | 612 | 420 | 157 | 16 |
| 9 | వెంకటేశ్వరపురం | 610 | 412 | 131 | 13 |
| 9ఎ | వెంకటేశ్వరపురం | 530 | 379 | 108 | 13 |
| 10 | వెంకటేశ్వరపురం | 605 | 362 | 194 | 13 |
| 10ఎ | వెంకటేశ్వరపురం | 372 | 239 | 114 | 8 |
| 11 | వెంకటేశ్వరపురం | 672 | 444 | 194 | 8 |
| 11ఎ | వెంకటేశ్వరపురం | 540 | 380 | 119 | 5 |
| 12 | ఆనకట్టరోడ్డు | 817 | 564 | 151 | 19 |
| 13 | ఆనకట్టరోడ్డు | 1082 | 685 | 312 | 21 |
| 14 | ఆనకట్టరోడ్డు | 468 | 304 | 105 | 25 |
| 15 | ఆనకట్టరోడ్డు | 823 | 500 | 222 | 34 |
| 16 | రంగనాయకులపేట | 411 | 286 | 83 | 13 |
| 17 | ఇసకడొంక | 151 | 114 | 25 | 3 |
| 18 | కామాక్షినగర్ | 324 | 184 | 120 | 9 |
| 19 | రంగనాయకులపేట | 820 | 538 | 213 | 31 |
| 20 | రంగనాయకులపేట | 575 | 256 | 263 | 29 |
| 21 | రంగనాయకులపేట | 894 | 336 | 457 | 51 |
| 22 | కపాడిపాళెం | 783 | 607 | 139 | 10 |
| 22ఎ | కపాడిపాళెం | 400 | 289 | 92 | 9 |
| 23 | కపాడిపాళెం | 637 | 465 | 128 | 32 |
| 23ఎ | కపాడిపాళెం | 449 | 314 | 102 | 15 |
| 24 | సుబేదారుపేట | 413 | 303 | 86 | 7 |
| 24ఎ | సుబేదారుపేట | 711 | 420 | 246 | 14 |
| 25 | ఎబిఎం గర్ల్స్ హైస్కూల్ | 620 | 343 | 213 | 32 |
| 26 | ఎబిఎం గర్ల్స్ హైస్కూల్ | 689 | 320 | 299 | 26 |
| 27 | సుబేదారుపేట | 661 | 444 | 166 | 19 |
| 28 | సుబేదారుపేట | 554 | 421 | 86 | 32 |
| 29 | శ్రీనివాసఅగ్రహారం | 584 | 288 | 205 | 31 |
| 30 | శ్రీనివాసఅగ్రహారం | 840 | 318 | 415 | 33 |
| 31 | సంతపేట | 962 | 390 | 494 | 45 |
| 32 | సంతపేట | 948 | 533 | 354 | 22 |
| 33 | సంతపేట | 752 | 255 | 427 | 37 |
| 34 | సంతపేట | 847 | 341 | 433 | 38 |
| 35 | సంతపేట | 529 | 216 | 281 | 12 |
| 35ఎ | సంతపేట | 460 | 186 | 235 | 18 |
| 36 | మండపాలవీధి | 192 | 80 | 94 | 5 |
| 37 | సంతపేట | 659 | 290 | 336 | 11 |
| 38 | సంతపేట | 645 | 265 | 339 | 15 |
| 39 | సంతపేట | 900 | 397 | 438 | 25 |
| 40 | సంతపేట | 489 | 230 | 217 | 19 |
| 40ఎ | సంతపేట | 503 | 181 | 278 | 17 |
| 41 | సంతపేట | 747 | 393 | 280 | 24 |
| 42 | సంతపేట | 539 | 311 | 198 | 12 |
| 43 | సంతపేట | 723 | 383 | 281 | 12 |
| 44 | సంతపేట | 472 | 277 | 155 | 13 |
| 44ఎ | సంతపేట | 582 | 333 | 191 | 20 |
| 45 | కోటమిట్ట | 624 | 341 | 232 | 22 |
| 46 | కోటమిట్ట | 554 | 185 | 329 | 23 |
| 46ఎ | కోటమిట్ట | 349 | 144 | 187 | 8 |

## 2014 నెల్లూరు సిటీ నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 47 | కోటమిట్ట | 438 | 172 | 234 | 18 |
| 48 | కోటమిట్ట | 170 | 71 | 87 | 6 |
| 49 | కోటమిట్ట | 276 | 99 | 151 | 16 |
| 50 | కోటమిట్ట | 607 | 269 | 291 | 19 |
| 51 | జెండావీధి | 345 | 209 | 87 | 27 |
| 52 | జెండావీధి | 372 | 253 | 56 | 14 |
| 53 | జెండావీధి | 614 | 410 | 108 | 48 |
| 54 | జెండావీధి | 687 | 487 | 126 | 23 |
| 55 | జెండావీధి | 673 | 415 | 163 | 35 |
| 56 | జెండావీధి | 584 | 435 | 91 | 15 |
| 57 | జెండావీధి | 645 | 493 | 81 | 25 |
| 57ఎ | జెండావీధి | 306 | 246 | 31 | 13 |
| 58 | జెండావీధి | 868 | 686 | 95 | 31 |
| 59 | జెండావీధి | 342 | 208 | 105 | 9 |
| 60 | జెండావీధి | 686 | 475 | 136 | 30 |
| 61 | జెండావీధి | 415 | 321 | 67 | 7 |
| 62 | బారకాస్ | 414 | 285 | 99 | 15 |
| 63 | బారకాస్ | 596 | 244 | 287 | 38 |
| 64 | బారకాస్ | 373 | 194 | 143 | 15 |
| 64ఎ | బారకాస్ | 339 | 162 | 150 | 12 |
| 65 | ఆచారివీది | 417 | 168 | 203 | 12 |
| 66 | ఆచారివీధి | 535 | 221 | 230 | 33 |
| 66ఎ | ఆచారివీధి | 372 | 126 | 220 | 7 |
| 67 | మూలాపేట | 528 | 287 | 211 | 12 |
| 67ఎ | మూలాపేట | 490 | 313 | 147 | 10 |
| 68 | మూలాపేట | 800 | 502 | 238 | 18 |
| 69 | మూలాపేట | 594 | 395 | 182 | 9 |
| 69ఎ | మూలాపేట | 409 | 255 | 135 | 6 |
| 70 | మూలాపేట | 530 | 328 | 180 | 7 |
| 70ఎ | మూలాపేట | 503 | 262 | 216 | 15 |
| 71 | మూలాపేట | 441 | 268 | 147 | 7 |
| 71ఎ | మూలాపేట | 498 | 263 | 203 | 17 |
| 72 | మూలాపేట | 441 | 224 | 193 | 9 |
| 72ఎ | మూలాపేట | 505 | 292 | 188 | 8 |
| 73 | మూలాపేట | 440 | 300 | 111 | 14 |
| 73ఎ | మూలాపేట | 476 | 324 | 109 | 22 |
| 74 | మూలాపేట | 542 | 418 | 74 | 10 |
| 74ఎ | మూలాపేట | 564 | 409 | 96 | 23 |
| 75 | మూలాపేట | 465 | 354 | 64 | 13 |
| 75ఎ | మూలాపేట | 402 | 322 | 49 | 14 |
| 76 | మూలాపేట | 610 | 444 | 115 | 27 |
| 77 | మూలాపేట | 611 | 415 | 145 | 22 |
| 78 | మూలాపేట | 546 | 305 | 214 | 13 |
| 79 | మూలాపేట | 788 | 521 | 208 | 17 |
| 80 | మూలాపేట | 673 | 396 | 213 | 22 |
| 81 | మూలాపేట | 655 | 343 | 255 | 25 |
| 82 | మూలాపేట | 548 | 424 | 78 | 21 |
| 82ఎ | మూలాపేట | 407 | 324 | 45 | 15 |
| 83 | మూలాపేట | 563 | 438 | 84 | 13 |
| 84 | మూలాపేట | 753 | 530 | 183 | 19 |
| 85 | ఫత్తేఖాన్‌పేట | 525 | 299 | 198 | 12 |
| 86 | ఫత్తేఖాన్‌పేట | 712 | 454 | 221 | 13 |
| 87 | మూలాపేట | 625 | 414 | 188 | 8 |
| 88 | ఫత్తేఖాన్‌పేట | 243 | 99 | 120 | 11 |
| 89 | విఆర్‌కాలేజి | 572 | 195 | 345 | 16 |
| 90 | ట్రంకురోడ్డు | 383 | 157 | 167 | 24 |
| 91 | విఆర్ హైస్కూల్ | 253 | 115 | 107 | 11 |

## 2014 నెల్లూరు సిటీ నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 92 | విఆర్ హైస్కూల్ | 454 | 216 | 189 | 17 |
| 93 | విఆర్ హైస్కూల్ | 747 | 396 | 308 | 13 |
| 94 | విఆర్ లా కాలేజి | 384 | 178 | 171 | 13 |
| 94ఎ | విఆర్ లా కాలేజి | 377 | 174 | 184 | 8 |
| 95 | విఆర్ హైస్కూల్ | 640 | 316 | 256 | 37 |
| 96 | తిప్పరాజువారివీధి | 636 | 240 | 347 | 34 |
| 97 | తిప్పరాజువారివీధి | 215 | 54 | 140 | 16 |
| 98 | తిప్పరాజువారివీధి | 217 | 84 | 115 | 9 |
| 99 | ముంగమూరువారివీధి | 367 | 147 | 199 | 9 |
| 100 | ముంగమూరువారివీధి | 410 | 110 | 268 | 20 |
| 100ఎ | ముంగమూరువారివీధి | 311 | 100 | 191 | 7 |
| 101 | ముంగమూరువారివీధి | 313 | 107 | 162 | 31 |
| 102 | ముంగమూరువారివీధి | 326 | 72 | 182 | 50 |
| 102ఎ | ముంగమూరువారివీధి | 359 | 107 | 162 | 70 |
| 103 | నాగులమిట్టరోడ్డు | 423 | 152 | 235 | 21 |
| 104 | తుమ్మలకట్ట సంఘం | 583 | 365 | 192 | 13 |
| 105 | మైపాడు రోడ్డు | 706 | 451 | 213 | 19 |
| 106 | మైపాడు రోడ్డు | 610 | 360 | 210 | 14 |
| 107 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 676 | 250 | 388 | 27 |
| 108 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 911 | 550 | 329 | 14 |
| 109 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 534 | 290 | 202 | 16 |
| 110 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 749 | 438 | 243 | 12 |
| 111 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 834 | 509 | 281 | 14 |
| 112 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 509 | 269 | 214 | 13 |
| 113 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 994 | 595 | 360 | 15 |
| 114 | జాకీర్‌హుస్సేన్ నగర్ | 808 | 503 | 260 | 12 |
| 115 | మైపాడు రోడ్డు | 449 | 266 | 146 | 18 |
| 116 | మైపాడు రోడ్డు | 882 | 448 | 373 | 35 |
| 117 | మైపాడు రోడ్డు | 717 | 376 | 294 | 24 |
| 118 | మైపాడు రోడ్డు | 822 | 425 | 355 | 18 |
| 119 | కిసాన్‌నగర్ | 553 | 285 | 238 | 13 |
| 120 | మైపాడు రోడ్డు | 544 | 268 | 243 | 16 |
| 121 | మైపాడు రోడ్డు | 617 | 349 | 210 | 14 |
| 122 | మైపాడు రోడ్డు | 591 | 300 | 246 | 16 |
| 123 | మైపాడు రోడ్డు | 751 | 360 | 336 | 30 |
| 124 | మైపాడు రోడ్డు | 589 | 315 | 243 | 10 |
| 125 | మైపాడు రోడ్డు | 421 | 178 | 218 | 8 |
| 126 | నవాబుపేట | 371 | 205 | 145 | 5 |
| 126ఎ | నవాబుపేట | 640 | 341 | 260 | 14 |
| 127 | నవాబుపేట | 893 | 418 | 435 | 20 |
| 128 | కుసుమ హరిజనవాడ | 858 | 473 | 328 | 24 |
| 129 | కుసుమ హరిజనవాడ | 677 | 408 | 242 | 4 |
| 130 | కుసుమ హరిజనవాడ | 880 | 543 | 285 | 18 |
| 131 | మైపాడు రోడ్డు | 817 | 421 | 352 | 15 |
| 132 | నవాబుపేట | 857 | 427 | 377 | 23 |
| 133 | నవాబుపేట | 819 | 532 | 243 | 17 |
| 134 | నవాబుపేట | 969 | 345 | 580 | 23 |
| 135 | నవాబుపేట | 597 | 311 | 259 | 13 |
| 135ఎ | నవాబుపేట | 471 | 171 | 278 | 8 |
| 136 | నవాబుపేట | 764 | 249 | 452 | 27 |
| 137 | నవాబుపేట | 846 | 281 | 494 | 36 |
| 138 | నవాబుపేట | 653 | 257 | 364 | 12 |
| 138ఎ | నవాబుపేట | 814 | 340 | 423 | 20 |
| 139 | నవాబుపేట | 785 | 347 | 405 | 8 |
| 140 | నవాబుపేట | 548 | 213 | 315 | 8 |
| 141 | లక్ష్మీపురం | 793 | 399 | 300 | 18 |

కొరవ 15వ పేజీలో

## నప్పని దుస్తులు వేయను!



ఆకర్షణ హీరోయిన్ తమన్నా సొంతం. అందుకే బడా హీరోలు తమన్నా తమ సరసన నటించాలనుకొంటారు. దర్శకులు కూడా తమన్నా కోసం హీరోయిన్ పాత్రల్లో ఇంకాస్త గ్లామర్ మేళవిస్తుంటారు. రామ్‌చరణ్, ఎన్టీఆర్, బన్నీ, రామ్‌లతో సమానంగా డాన్స్ చేయగల హీరోయిన్ తమన్నా. బాహుబలి చిత్రం షూటింగ్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. హమ్‌షకల్స్ హిందీ సినిమాలో ఎంత అడిగినా బికినీ వేయలేదంటే; అని అడగ్గా సమాధానంగా నాకసలు బికినీ అంటేనే పడదు. నా కుటుంబసభ్యులతో సినిమా చూడాల్సి వచ్చినప్పుడు నేను ఏమాత్రం ఇబ్బంది పడకూడదు. అందుకే చిత్ర బృందం ఎంత బతిమలాడినా ఒప్పుకోలేదంది. దుస్తుల విషయంలో మీ ఆలోచనలు ఎలా ఉంటాయంటే ఫ్యాషన్ కంటే సౌకర్యం ముఖ్యం. ఎంత ట్రెండీగా ఉన్నా సరే నాకు నప్పని దుస్తులు వేసుకోనని తేల్చి చెప్పింది.



## పాట కోసం ఎదురుచూడాలి

చిత్రాంగద సింగ్ చేసిన సినిమాలు తక్కువే అయినా పేరు మాత్రం ఘనంగానే తెచ్చుకొంది. తొలుత మాడలింగ్ రంగంలో అడుగుపెట్టిన ఈ భామ అనతికాలంలోనే వెండితెరపై తళుక్కున మెరిసింది. ప్రస్తుతం రణదీప్ హుడాతో నటించనుంది. ప్రముఖ రాజకీయ నాయకుడు అజయ్‌కుమార్ జీవితంపై ఓ చిత్రాన్ని తీస్తున్నారట. అజయ్ పాత్రను రణదీప్ హుడా పోషించనున్నాడు. ఆయన భార్యగా చిత్రాంగద నటించనుంది. దేశీబాయ్స్‌తో పాపులారిటీ సంపాదించిన చిత్రాంగద అంతకు ముందు 4చిత్రాల్లో నటించింది. అయితే కమర్షియల్‌గా 'దేశీ బాయ్స్' సినిమా మంచి గుర్తింపునిచ్చింది. సూర్య చిత్రం అంజాన్‌లో ఐటమ్ భామగా హాట్‌హాట్‌గా కనిపించనుంది. ప్రత్యేక గీతం అంటే మసాలా మేళవింపు కాదు. ఆ పాటలో ఓ కిక్ ఉండాలి. పాట ఎప్పుడొస్తుందా అని ప్రేక్షకులు ఎదురు చూడాలంది.

## ఎవరతను?



హీరోయిన్ ప్రియమణి ప్రేమలో పడింది. ఈ విషయాన్ని చాలాకాలం క్రిందటే ప్రియమణి ధృవీకరించింది. ప్రేమలో పడ్డా. త్వరలోనే తీపి కబురు చెబుతా అని అందరికీ చెప్పేసింది. అప్పట్నుంచీ ఆ లక్కీ ఫెలో ఎవరు? అంటూ తెలుగు, తమిళ చిత్ర రంగాలు ఆసక్తిగా ఆరాతీయడం మొదలెట్టాయి. గోవింద్ పద్మసూర్య మళయాళంలో ఓ మాదిరిగా పేరు తెచ్చుకున్న నటుడీయన. ఇటీవల ట్విట్టర్‌లో ప్రియమణితో సన్నిహితంగా ఉన్న ఒక ఫోటోను ట్వీట్ చేశాడు. అప్పటి నుంచి ప్రియమణి చెప్పిన అతగాడు గోవిందే అన్న ప్రచారం జరుగుతోంది. అయితే ఈ విషయంలో అటు ప్రియమణిగానీ, ఇటు గోవింద్‌గానీ వివరణ ఇవ్వలేదు.

## ఎన్టీఆర్‌తో ఆలియా!



టూ స్టేట్స్, స్టూడెంట్ ఆఫ్ ది ఇయర్, హైవే... ఇలా విజయవంతమైన చిత్రాల్లో నటించి టాప్ హీరోయిన్‌గా ఎదుగుతోంది ఆలియా భట్. ఇప్పుడీ భామ దక్షిణాదిపై కన్నేసింది. మన వాళ్లు కూడా ఆలియాభట్‌ని అర్జెంట్‌గా టాలీవుడ్‌కు దిగుమతి చేసేయాలనే వీర ప్రయత్నాల్లో వున్నారు. త్వరలోనే ఆలియా టాలీవుడ్‌లో ఎంట్రీ ఇవ్వడం ఖాయమని ఫిల్మ్‌నగర్ వర్గాలు చెప్పుకొంటున్నాయి. ఎన్టీఆర్‌తో ఆలియాభట్ జోడి కట్టబోతోందని లేటెస్ట్ టాక్. ఈ చిత్రానికి పూరీ జగన్నాథ్ దర్శకుడు. ఆలియా కూడా తాను దక్షిణాదిలో ఒక చిత్రాన్ని ఒప్పుకొన్నట్లు ధృవీకరించింది.

## ఫైట్లు చేయలేనండీ!



నా దగ్గరకు వచ్చిన పాత్రకు నేను సరిపోతానా? లేదా? అనేదే ఆలోచిస్తా. వచ్చిన ప్రతి సినిమానీ అంగీకరించలేనంటుంది సమంత. నా శరీర స్వభావాన్ని అర్థం చేసుకోండి. ఏంజెలినాలా ఫైట్లు చేయమంటే నా వల్ల కాదు. తెరపై అందంగా కనిపించడానికి కావాల్సిన ముఖ కవళికలు నాకున్నాయి. నా అదృష్టం కొద్దీ... నన్ను గ్లామర్ పాత్రల్లోనే చూపిస్తున్నారు దర్శకులు. ఆర్ట్ సినిమాల్లోనూ చేస్తా. కాకపోతే ఏ సినిమాలోనైనా నేను చేసే పాత్రకు ఓ లక్ష్యం అంటూ ఉండాలంటోంది సమంత.

# దృశ్యం పరవాలేదు



చిత్ర సమీక్ష

✍ అల్లూరు రహీం

మళయాళంలో విజయవంతమైన 'దృశ్యం' చిత్రాన్ని అదే పేరుతో తెలుగులో వెంకటేష్ హీరోగా సురేష్ ప్రొడక్షన్స్, రాజ్‌కుమార్ ప్రొడక్షన్స్ కలసి రీమేక్ చేశాయి. రీమేక్ చిత్రాల హీరోగా తెలుగులో వెంకటేష్ ప్రసిద్ధుడు. ఆయన రొటీన్‌కు భిన్నంగా ఈ చిత్రంలో ఇద్దరు ఆడపిల్లల తండ్రిగా నటించాడు. ఆయన వయసుకు తగ్గ పాత్రలో ప్రేక్షకులను ఆకట్టుకొనే పనిచేశాడు. ఈ చిత్రానికి 'పొట్టేలు పున్నమ్మ' ఫేమ్ హీరోయిన్ శ్రీప్రియ దర్శకులు. దృశ్యాన్ని తీయను ఆమె పెద్దగా కష్టపడలేదు. మోహన్‌లాల్ హీరోగా మళయాళంలో రూపొందిన ఈ చిత్రాన్ని మక్కీకి మక్కీ దించేసింది. దృశ్యం మళయాళ చిత్రంలో మోహన్‌లాల్ క్రిస్టియన్. ఈ చిత్రంలో హీరో వెంకటేష్ హిందూ కుటుంబీకునిగా చేయడమొకటే ఆమె చేసిన మార్పు. మళయాళంలో కథకుడు, దర్శకుడు జోసఫ్. మాటలతో, థ్రిల్లర్ సన్నివేశాలతో చిత్రాన్ని లాగించేశాడు. తెలుగు చిత్రాల్లో పాటలు, మాటలు బాగుండాలి. ఈ రెండూ ఇక్కడ కుదరలేదు. చిత్రంలో రెండే పాటలున్నాయి. ప్రతి రోజు పండుగ రోజు పల్లవితోసాగే పాట మినహా మరోపాట బాగాలేదు. డార్లింగ్ స్వామి వ్రాసిన మాటల్లో గొప్పవి కూడా రెండే రెండు. మనుషులు స్వార్థంతో బతుకుతారు. పెద్దోళ్లు తప్పుచేసి ఒప్పుకోరు. చిత్రం ప్రథమార్థమంతా కాసింత ఫ్యామిలీ డ్రామా ఉంది. ద్వితీయార్థం మాత్రం సస్పెన్స్‌తో నడపాలన్న ప్రయత్నం పూర్తిగా ఫలించలేదు. అయితే బోరు కొట్టని స్క్రీన్‌ప్లేతో శ్రీప్రియ లాగెయ్యడంలో మాత్రం విజయం సాధించిందనే చెప్పాలి. తెలుగు రీమేక్‌లో కాసింతగా కామెడీ దృశ్యాలను ఇరికించి ఉంటే సస్పెన్స్ ఉక్కపోత నుంచి ప్రేక్షకులకు కాసింత రిలీఫ్ దొరికేది. మూల మాతృకలోలేని వాటి జోలికి ఎందుకెళ్లాలని ఆ ప్రయత్నం చేసినట్లు లేదు. చంటి చిత్రంలో మీనా, వెంకటేష్ జంట చూడముచ్చటగా ఉంటుంది. సుందరకాండ చిత్రంలోనూ అంతే. కానీదృశ్యంలో మీనా, వెంకటేష్‌ల గ్లామర్ బాగా తగ్గిందనే చెప్పాలి. అత్తారింటికి దారేది చిత్రంలో అత్తగా తెలుగు ప్రేక్షకులు మెచ్చిన నదియా దృశ్యం చిత్రంలో డిఐజి స్థాయి పోలీస్ అధికారిగా, బిడ్డను పోగొట్టుకొన్న తల్లిగా విలక్షణ నటనతో మళ్లీ ప్రేక్షకాభిమానం పొందింది. రవికాలే కానిస్టేబుల్ పాత్రలో జీవించాడని చెప్పాలి. చిత్రం ముగింపు సన్నివేశంలో మళయాళ సూపర్ స్టార్ మోహన్‌లాల్ కన్నా వెంకటేషే మెరుగైన నటన ప్రదర్శించాడని చెప్పక తప్పదు.

సస్పెన్స్ కథ కాబట్టి కొద్దిగానే చెప్పాలి. విజయనగరం జిల్లా రాజవరం గ్రామంలో జ్యోతి కేబుల్ ఆపరేటర్ రాంబాబు(వెంకటేష్) గ్రామస్తులకు తలలో నాలుక మాదిరి వ్యవహరిస్తుంటాడు. ఈయన సతీమణి జ్యోతి(మీనా). వీరిద్దరికి అంజు(కృతిక), అను (బేబి ఎస్తేర్) పిల్లలు. రాంబాబు పొదుపుగా జీవితాన్ని లాక్కొని వస్తుంటాడు. అయితే రాంబాబు భార్యాబిడ్డలంటే ఎనలేని అభిమానం. అంజు నేచర్ క్యాంప్‌లో భాగంగా దేశంలోని కొన్ని ప్రాంతాలకు వెళ్తుంది. ఈ క్యాంప్‌లో ఆమెకు డిఐజి గీతా(నదియా), ప్రభాకర్(నరేష్)ల కుమారుడు వరుణ్ పరిచయం అవుతాడు. గారాబంగా పెరిగే వరుణ్ ఈ క్యాంప్‌లో బాత్రూంలో స్నానం చేస్తున్న అంజును వివస్త్రగా సెల్‌ఫోన్ పెట్టి చిత్రీకరిస్తాడు. క్యాంప్ అయ్యాక ఒకరోజు రాజవరం వచ్చి అంజుకు ఆ సన్నివేశాలు చూపించి ఒక గంట తనతో గడపమంటాడు. ఈ విషయం ఆమె తన తల్లితో చెబుతుంది. జోరున వర్షం పడే రాత్రి అంజు వాళ్ల ఇంటికి వచ్చే వరుణ్ తర్వాత కనపడకుండా పోతాడు. పెద్ద పోలీస్ బిడ్డ కనపడకుండాపోతే చెప్పాలా? దర్యాప్తులు, థర్డ్ డిగ్రీ ప్రయోగాలు రాంబాబు కుటుంబం మీద జరుగుతాయి. కానీ చివరికి ఆధారం దొరక్క పోలీసులే వెనుకంజ వేయాల్సి వస్తుంది. వరుణ్ ఏమయ్యాడనేది చిత్రం చూసి తెలుసుకోవడమే ఉత్తమం. టైమ్‌పాస్‌కు 'దృశ్యం'కు వెళ్లొచ్చు.

# ఇందిరమ్మ ఇళ్ల లబ్దిదారులకు న్యాయమెప్పుడు?

ప్రభుత్వ సహకారంతో ఇళ్లు నిర్మించుకోవాలనుకొన్న ఇందిరమ్మ ఇళ్ల లబ్దిదారుల పరిస్థితి ఎవరికీ పట్టడం లేదు. ప్రతిపక్షంలో వుండగా రోజు దానిపై ఆందోళన చేపట్టి ఇప్పుడు అధికారాన్ని చేపట్టిన తెలుగు దేశం పార్టీకానీ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకానీ, అధికారులు కానీ ఎవరూ పట్టించుకోకపోవడంతో కొత్తూరు సమీపంలో వైఎస్ఆర్ నగరంలోని ఇందిరమ్మ ఇళ్ల లబ్దిదారుల ఆవేదన అరణ్య రోదనే అవుతుంది. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి. గత కాంగ్రెస్ ప్రభుత్వం పేదలకు పక్కా గృహాలను నిర్మించి ఇవ్వాలని ఇందిరమ్మ ఇళ్ల పథకాన్ని ప్రవేశ పెట్టింది. ఇందులో భాగంగానే ఈ ప్రాంతంలో 6,468 మందికి ఇళ్లు నిర్మించ తలచింది. ఈ ఇంటి నిర్మాణ పనులను ఆనాడు రూరల్ ఎమ్మెల్యేగా వుండిన ఆనం వివేకానందరెడ్డి తన అనుచరులకు కాంట్రాక్ట్ కట్టబెట్టడంతో అవినీతి చోటుచేసుకుంది. 150 ఇళ్లను ఒక్క ప్యాకేజి క్రింద మొత్తం 43 ప్యాకేజీలుగా విభజించారు. ఇళ్ల నిర్మాణంలో అడుగడుగునా అవినీతి, నాసిరకంగా నిర్మించడంతో 2012లో ఆగష్టు నెలలో వీటిలో ఫ్లాట్ నెం.3490లో గల ఇల్లు కుప్ప కూలింది. ఈ ఘటనపై తెలుగుదేశం, వైకాపా పెద్ద ఎత్తున ఆందోళన చేపట్టింది. అప్పటి ప్రతిపక్ష నేతగా వున్న చంద్రబాబు నాయుడు ఈ ఇళ్లను పరిశీలించారు. పట్టుకొంటే పిండి పిండి అయ్యే ఇటుకలు ఈ నిర్మాణంలోని అవినీతి, అక్రమాలకు అద్దం పట్టాయి. అప్పటి ప్రభుత్వం విచారణకు ఆదేశించగా హైదరాబాద్ నుంచి గృహ నిర్మాణ శాఖ ఎస్ఇ శ్రీరాములు తనిఖీచేసి అవినీతి నిజమేనని నిగ్గు తేల్చారు. కానీ అప్పటి గృహ నిర్మాణ శాఖ అధికారులతో వివేకానందరెడ్డి కావాలని ఇళ్లు ఎవరో కూల్చారని అబద్ధపు స్టేట్‌మెంట్ ఇప్పించాడు. ఇది జరిగి రెండేళ్లు గడిచింది. కొత్త ప్రభుత్వం అధికారం చేపట్టింది. అయినా


అవినీతి అక్రమాల పథకమిది

ఇందిరమ్మ ఇళ్ల లబ్దిదారులకు ఇంతవరకు న్యాయం జరగలేదు. అధికారులు, ప్రజాప్రతినిధులు తమకు న్యాయం చేయాలని, చేస్తారని ఆశగా ఎదురు చూస్తున్నారు.

## కార్పొరేషన్ సిబ్బందిలో గుబులు!

### మేయర్ ఎలా పనిచేస్తారు?

కార్పొరేషన్‌లో అధికారం మారింది. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి చెందిన అబ్దుల్ అజీజ్ మేయర్ అయ్యాడు. నిన్నమొన్నటి వరకు ఆనం వివేకానందరెడ్డి కనుసన్నల్లో వుండిన పురపాలన ఇప్పుడు వైకాపా వశం అయ్యింది. ఇటీవలే రూరల్, సిటీ ఎమ్మెల్యేలు కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్ కార్పొరేషన్ అధికారులు, సిబ్బందితో సమావేశం నిర్వహించి పద్ధతి మార్చుకోవాలని, వివేకానందరెడ్డికి అడుగులు మడుగులొత్తే అధికారులు ఆ విధానానికి స్వస్తి చెప్పాలని హెచ్చరికలు చేశారు. మరోవైపు మేయర్‌గా అజీజ్ రావడంతో సకల సబ్బండు అక్రమాలకు, అవినీతికి పాల్పడిన సిబ్బందిలో గుబులు పుట్టింది. వివేకానందరెడ్డి పట్ల ప్రభు భక్తి చాటుకొన్న తమకు ఇప్పుడు ఎవరు దిక్కన్న ఆందోళన వ్యక్తమౌతోంది. గత పదేళ్లుగా కార్పొరేషన్‌లో జరిగిన అక్రమాలు, అవినీతి అంతా ఇంతా కాదు. టౌన్ ప్లానింగ్, వాటర్ వర్క్స్, ప్రజారోగ్య విభాగాలు ముఖ్యంగా చెత్త తొలగింపు వాహనాల కొనుగోలు పేరిట జరిగిన అక్రమాలు అంతా ఇంతా కాదు. కొన్ని విభాగాలపై ఎసిబి నిఘా పెట్టింది. గతంలో ఒకటి రెండు సార్లు దాడులు జరిపిన ఎసిబి ఇటీవల కార్పొరేషన్‌పై తిరిగి దృష్టి సారించింది. ఇటీవల ఆ శాఖ అధికారులు కీలకమైన రికార్డులను పరిశీలించినట్లు సమాచారం. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ, తెలుగుదేశం పార్టీ కార్పొరేషన్ అక్రమాలు, అవినీతిపై దృష్టి సారిస్తుండడం, మరోవైపు ఎసిబి నిఘా పెట్టడంతో అవినీతిపరులైన అధికారులు, సిబ్బంది ఎప్పుడు ఏమి జరుగుతుందో, ఎవరి బండారం బట్టబయలౌతుందోనన్న భయాందోళనలో వున్నట్లు తెలుస్తుంది. అవినీతిపరులైన సిబ్బందిని గాడిలో పెడితే మేయర్‌గా అజీజ్ ప్రజల మన్ననలు అందుకోవడం ఖాయం.

## ప్రజావిజ్ఞప్తుల పరిష్కారంపై శ్రద్ధపెట్టిన కలెక్టర్!

● పరిష్కారం దొరికితే పర్లేదు

ప్రజా విజ్ఞప్తుల దినంలో స్వీకరిస్తున్న వినతి పత్రాలను పరిష్కరించేందుకు జిల్లా కలెక్టర్ శ్రీకారం చుట్టారు. జిల్లా కలక్టరేట్‌లో ప్రతి సోమవారం ప్రజావిజ్ఞప్తుల దినం నిర్వహిస్తున్న సంగతి తెలిసిందే. ఈ కార్యక్రమంలో స్వీకరిస్తున్న వినతి పత్రాలపై క్రిందిస్థాయి అధికారుల్లో స్పందన కానరావడం లేదు. ఒకే సమస్యపై పదే పదే వినతిపత్రాలు అందుతుండడంతో కలెక్టర్ సంబంధిత శాఖ అధికారులను ప్రశ్నించడం ప్రారంభించారు. ఇటీవల గ్రీవెన్స్ వినతిపత్రాలపై వివిధ శాఖలకు చెందిన జిల్లాస్థాయి అధికారులతో సమీక్ష జరిపారు. శాఖలవారీగా అందిన వినతి పత్రాలపై తక్షణం చర్యలు చేపట్టాలని కలెక్టర్ ఆదేశించారు. గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారు ఎంతో కష్టపడి జిల్లా కేంద్రానికి చేరుకుని తాము ఎదుర్కొంటున్న సమస్యలపై విన్నవించుకుంటున్నారు. జిల్లా కలెక్టరేట్ నుండి సంబంధిత శాఖలకు పంపిన వినతి పత్రాలపై ఎటువంటి చర్యలు తీసుకుంటున్నారని సమీక్షా సమావేశంలో కలెక్టర్ అధికారులను అడిగి తెలుసుకున్నారు. వినతి పత్రాలను ఆన్‌లైన్‌లో పొందుపరచడంతో నిర్ణయించిన సమయంలోగా పరిష్కరించాలన్నారు. ప్రజలకు జవాబుదారీగా వ్యవహరించని అధికారులపై కఠిన చర్యలు తీసుకుంటామని సున్నితంగా హెచ్చరికలు చేశారు. దీంతో కార్యాలయాల్లో దుమ్ము పట్టి వున్న వినతి పత్రాలను బయటకు తీసి పరిశీలించే పనిలో పడ్డారు. అధికారులు చాలా రోజులు అనంతరం జిల్లా కలెక్టర్ గ్రీవెన్స్‌డేలో స్వీకరించిన వినతి పత్రాల పరిష్కారానికి శ్రీకారం చుట్టడం అభినందనీయం.

## మేయర్ తొలి పర్యటనలో చెత్తకుప్పల స్వాగతం!

మునిసిపల్ కార్పొరేషన్ సిబ్బంది పనితీరు కొత్తగా మేయర్ అయిన అబ్దుల్ అజీజ్‌కు స్వయంగా తెలిసి వచ్చింది. మేయర్‌గా బాధ్యతలు చేపట్టిన అనంతరం తన సొంత డివిజన్ అయిన 52లో ఆయన పర్యటించారు. కార్పొరేషన్‌ను గాడిలో పెడతామని పారిశుద్ధ్యానికి, త్రాగునీటికి అధిక ప్రాధాన్యమిస్తానని పదే పదే చెప్పే అజీజ్‌కు ఈ డివిజన్‌లో పర్యటన సందర్భంగా ఆశ్చర్యపోయే రీతిలో అశలు పురపాలన వుందా అనే రీతిలో సమస్యలు స్వాగతం చెప్పాయి. పేరుకపోయిన చెత్త కుప్పలు, వ్యర్థాలతో కుళ్లు కంపు కొడుతుండడం, మురుగునీరు రోడ్లపైకి చేరడంతో ఆ ప్రాంతం చూసేందుకే అసహ్యకరంగా వుంది. పారిశుద్ధ్యం ఎంత సుందరముదనష్టంగా వుందో స్వయంగా చూసిన మేయర్‌కు వాస్తవ పరిస్థితులు కళ్లకు కట్టినట్లయ్యింది. దీంతో ఆయన ప్రక్కనే వున్న మున్సిపల్ కమిషనర్ శ్యాంసన్‌పై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశాడు. తక్షణం పారిశుద్ధ్య పరిస్థితులు మెరుగుపర్చాలని ఆదేశించారు. మేయర్ ఓపిక చేసుకుని నగరమంతా పర్యటిస్తే కార్పొరేషన్ ఎంత అస్తవ్యస్తంగా పనిచేస్తుందో, ప్రజలు ఎంత ఇబ్బంది పడుతున్నారో అర్థమవుతుంది.

## ఎమ్మార్పీ ధరలకు మద్యం!

● మందుబాబుల హర్షం

లాటరీ పద్ధతిలో మద్యం షాపులు దక్కించుకున్న వ్యాపారులు ప్రభుత్వం నిర్ణయించిన ఎమ్మార్పీ ధరలకు మద్యం విక్రయిస్తున్నారు. బార్లలో మినహా మిగిలిన షాపుల్లో దుకాణాల బయట ఎమ్మార్పీ ధరలకే మద్యం విక్రయించబడును అనే బోర్డులు దర్శనమిస్తున్నాయి. మద్యం షాపులకు కాలవ్యవధి ముగియడంతో గత నెలలో మద్యం షాపులకు దరఖాస్తులు ఆహ్వానించింది ఎక్సైజ్ శాఖ. జిల్లా కలెక్టర్ ఆధ్వర్యంలో ప్రకటించిన షాపులకు వచ్చిన దరఖాస్తులను లాటరీ తీశారు. పోటీ లేకపోవడంతో లాటరీలో పేర్ల వచ్చిన వారికే షాపును కేటాయించారు. గత నెల వరకు జిల్లావ్యాప్తంగా అన్ని మద్య దుకాణాల యజమానులు సిండికేటుగా ఏర్పడి ఎమ్మార్పీ కంటే అధిక ధరలకు విక్రయాలు జరిపారు. నూతన ఎక్సైజ్ పాలసీ 2014 – 15 సంవత్సరం నుండి



అమల్లోకి రావడంతో ప్రభుత్వ నిబంధనలు పాటించాల్సి వచ్చింది. అధిక ధర చెల్లించను మద్యం సేవించిన వారు ప్రస్తుతం ఎమ్మార్పీ ధరకే మద్యం దొరకడంతో సంతోషం వ్యక్తం చేస్తున్నారు. అయితే ఎమ్మార్పీ ధరలు కొద్ది రోజులు అమలుచేసి ఆ తర్వాత వ్యాపారులంతా సిండికేటుగా ఏర్పడి అధిక ధరలు పెంచే అవకాశం వుంది. ఎక్సైజ్, పోలీస్, స్థానిక రాజకీయ నేతలకు మామూళ్లు ఇవ్వాల్సి వుంటుంది. ఈ క్రమంలో ధరలు పెంచక తప్పదని లేకుంటే నష్టాలు భరించాల్సి వస్తుందని కొందరు వ్యాపారులు వ్యాఖ్యానిస్తున్నారు. ఇదిలా వుండగా బెల్టు షాపుల నియంత్రణకు ఎక్సైజ్ శాఖ గట్టి కృషి చేయాల్సి వుంది.

## అంగన్‌వాడీలకు చిన్నసైజు కోడిగ్రుడ్లు!

అంగన్‌వాడీ కేంద్రాలకు వచ్చి చిన్నారులు, బాలింతలు, గర్భవతులకు పౌష్టికాహారం కోసం కోడిగ్రుడ్లు సరఫరా చేస్తున్నారు. వీటిని అంగన్‌వాడీ కేంద్రాలకు సరఫరా చేసే కాంట్రాక్టర్ మాయాజాలం ప్రదర్శిస్తున్నారు. తక్కువ ధరకు లభించి చిన్నసైజు కలిగిన గ్రుడ్లను సరఫరాచేసి లక్షలాది రూపాయల బిల్లులను మంజూరు చేయించుకుంటున్నారు. అంగన్‌వాడీ కేంద్రాలకు చిన్న సైజులో వున్న కోడిగ్రుడ్డు సరఫరా అవుతున్న సంగతి సిడిపిఓలందరికీ తెలుసు. కానీ ఎటువంటి అభ్యంతరం చెప్పడం లేదు. ఒక్కో వారంలో కొన్ని సెంటర్లకు కోడిగ్రుడ్లు సరఫరా కావు. సరఫరా అయినట్లుగా రికార్డుల్లో నమోదుచేసి బిల్లు మంజూరుకు సిఫారసు చేస్తున్నారన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. వారంలో రెండు దఫాలు కోడిగ్రుడ్లు అందించాల్సి వుంటుంది. పెద్ద సైజు కోడిగ్రుడ్డును సరఫరా చేస్తే గిట్టుబాటు లేదని, చిన్న కోడిగ్రుడ్డును కాంట్రాక్టర్లు సరఫరా చేస్తున్నారు. ఇటీవల వీటిపై దుమారం రేగడంతో ఐసిడిఎస్ పిడి విజయలక్ష్మి స్పందించారు. చిన్న సైజ్ కోడిగ్రుడ్లు కేంద్రాలకు వస్తే తీసుకోకుండా వెనక్కు పంపాలని ప్రకటన జారీ చేశారు. ఈ ప్రకటన చూసిన అంగన్‌వాడీ వర్కర్లు కొందరు చిన్న సైజ్ కలిగిన గ్రుడ్లను తీసుకునేందుకు నిరాకరించగా సిడిపిఓల నుండి ఒత్తిడి వచ్చినట్లు సమాచారం. ఈ ఒత్తిళ్లకు భయపడిన గ్రుడ్లను తీసుకోగా మరి కొందరు నిరాకరించినట్లు తెలిసింది. కోడిగ్రుడ్లను సరఫరా చేస్తున్న కాంట్రాక్టర్లు మామూళ్లు ఇవ్వడం ఇక్కడ ఆనవాయితీ. అంగన్‌వాడీ వర్కర్ల నుండి టిఏ బిల్లు మంజూరు కోసం పది శాతం కమిషన్ వసూలు చేస్తున్న సిడిపిఓలు కాంట్రాక్టర్ల నుండి ఎక్కువ కమిషన్లు కొట్టేస్తున్నారు.

## ఆంధ్రులకు చెంపదెబ్బ, గోడ దెబ్బ!

మొదటి పేజీ కొరవ

మరొకవైపు విద్యార్థుల ఫీజుల విషయంలోనూ కఠినంగా వ్యవహరిస్తున్నాడు. 1956కు ముందు హైదరాబాదులో స్థిరపడిన వారిని మాత్రమే తెలంగాణ వాసులుగా గుర్తించి ఫీజులు వాపసు ఇస్తాననంటున్నాడాయన. దీనివల్ల కొత్త విద్యార్థుల సంగతి పక్కనపెట్టి, ఇప్పటికే హైదరాబాదులోని కాలేజీలో చదువుతున్న విద్యార్థుల పరిస్థితి చూస్తే ఆందోళన కలుగుతున్నది. చదువు సగంలో ఆపి వేయడం తప్ప ఫీజులు కట్టుకోలేని విద్యార్థులకు వేరే మార్గం మాత్రం లేదు. ఇంజనీరింగ్, మెడిసిన్ రెండు, మూడు, నాలుగు సంవత్సరాలు చదువుతున్న విద్యార్థులు గందరగోళానికి గురౌతున్నారు.

ఒక్క ఆంధ్రుల విషయంలోనే కెసిఆర్ ఇంత కర్కశంగా వ్యవహరిస్తున్నాడు. బంగ్లాదేశ్ యుద్ధం సమయంలో పెద్ద సంఖ్యలో బెంగాలీయులు హైదరాబాదుకు వలస వచ్చారు. గుజరాత్, బొంబాయి అల్లర్ల తర్వాత ఆ ప్రాంతాల నుంచి కూడా చాలా మంది పేదవాళ్లు వలస వచ్చి, స్థిరపడ్డారు. ఒరిస్సా నుంచి కూడా వలసలున్నాయి. కెసిఆర్ వీరెవరి గురించీ మాట్లాడడం లేదు. ఒక్క ఆంధ్రుల మీదనే కత్తి ఝుళిపిస్తున్నాడు. ఎన్నికల సమయంలో చాలా హామీలిచ్చాడు కెసిఆర్. ఉద్యోగాలు, నీళ్ల విషయంలో పెద్ద పెద్ద మాటలు చెప్పాడు. ఇప్పుడు అవి రెండూ ఆయనకు కొరుకుడు పడడం లేదు. దానితో జనం దృష్టి మళ్లించడానికి ఆంధ్రుల మీద తెలంగాణ ప్రజలలో విద్వేషాలు రెచ్చ గొట్టడానికి కుట్ర పన్నుతున్నాడని భావించాలి. రాజకీయ అవసరం కోసం జనం జీవితాలతో ఆటలాడుతున్నాడాయన. బొంబాయి శివ సేన వలె ఇక్కడ ఒక ప్రాంతీయ విద్వేష ఉద్యమాన్ని నిర్మించడానికి కుటిల ప్రయత్నం చేస్తున్నాడు.

కాలేజీ ఫీజుల వలె రేషన్ కార్డుల విషయంలోనూ స్థానికత అంశాన్ని పైకి తెచ్చి, ఆంధ్రులకు రేషన్ సరుకులు అందకుండా చేయబోతున్నారని ఒక వార్త. ఆంధ్రకు చెందిన పెట్టుబడిదారులు తెలంగాణ ఆస్తులను కొల్లగొట్టారని కెసిఆర్ భావిస్తే, భావించవచ్చు. కానీ ఆ కోపం కూటికి లేని పేదల మీద తీర్చుకోవాలని చూడడం మాత్రం అన్యాయం.



అనంతపురంలోని జెఎన్‌టియూ విడుదల చేసిన బిటెక్ నాల్గవ సంవత్సరం ఫలితాల్లో ట్రిపుల్ ఈ విభాగంలో 85.69 మార్కులు సాధించి గూడూరు ఆదిశంకర మహిళా ఇంజనీరింగ్ కాలేజ విద్యార్థిని మల్లెంబాక సాయిశ్రీని అభినందిస్తున్న కాలేజ ప్రిన్సిపాల్ మల్లిఖార్జునరావు. ఈ యువతి తండ్రి రమేష్ ఫత్తేఖాన్‌పేటలో పేపర్ స్టాల్ నిర్వాహకుడు.

## ఎస్పీ బదిలీ

16వ పేజీ కొరవ

పార్టీ నిర్వీర్యం కావడమే కాక, జగన్ కూడా మానసికంగా ధైర్యం కోల్పోతాడన్నది వ్యూహం. రాష్ట్రంలో ప్రధాన ప్రతిపక్షం అంతగా బలహీన పడితే ప్రభుత్వ పక్షానికి మేలే కదా? అయితే తన ఎమ్మెల్యేలు అంత సులభంగా చేజారి పోవడాన్ని జగన్ చూస్తూ వూరకుంటాడా, అడ్డుకొనే ప్రయత్నం చేయడా అన్నది ప్రశ్న.

ఇదిట్లా వుంటే చంద్రబాబు ఆకర్షణ మంత్రం నెల్లూరు జిల్లాకు చెందిన ఇద్దరు ఎమ్మెల్యేల మీద ప్రధానంగా పని చేస్తున్నట్లు తెలుస్తున్నది. జిల్లా మంత్రి నారాయణతో వీరిద్దరూ ఇప్పటికే ప్రాథమిక చర్చలు కూడా జరిపినట్లు చెప్తున్నారు. వారిని అనుసరించి మరొక ఇద్దరు లేదా ముగ్గురు కూడా గోడ దూకవచ్చునని అంచనా. నెల్లూరు జిల్లాలో ఎమ్మెల్యేలను పెద్దసంఖ్యలో పార్టీలోకి రప్పించడం ద్వారా తన రాజకీయ పునాదులను బలపరచుకోవాలని జిల్లా మంత్రి నారాయణ ఆలోచన. అయితే ఇందుకు స్వంత పార్టీ నుంచి ఎంతవరకు మద్దతు లభిస్తుందన్నది ప్రశ్న. జగన్ పార్టీ ఎమ్మెల్యేల రాకను జిల్లా తెలుగు నేతలు గట్టిగా ప్రతిఘటించే అవకాశం వుంది. వారు వస్తే తమ ఉనికికే ప్రమాదమని వీరి భావన.

ఈ బడ్జెట్ సమావేశాలలోనే ఫిరాయింపుల పర్వానికి శ్రీకారం చుడతారా లేక కొంతకాలం వేచి చూస్తారా అన్నది తెలియడం లేదు.

మోకాలి లోతున మురుగు నీరు వచ్చి చేరడంతో విద్యార్థులు, ఇళ్లలోనివారు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వచ్చింది.

## చురుక్కుమంటున్న సిగరెట్ ధరలు

ధూమపాన ప్రియులకు పెరిగిన సిగరెట్ ధరలు చురుక్కుమనేలా చేస్తున్నాయి. దమ్ముమీద దమ్ము కొడుతూ సిగరెట్ కాల్చే వారికి ఇటీవల పెరిగిన ధరలతో చుక్కలు కన్పడుతున్నాయి. చిన్న సైజు సిగరెట్ నుంచి అందరూ విరివిగా తాగే గోల్డ్ కింగ్ సిగరెట్ల ధరలు మూడు నాలుగు రూపాయలు పెరగడంతో సిగరెట్ త్రాగే అలవాటు మానలేక, అంతంత ధరపెట్టి సిగరెట్లు కొనలేక ధూమపాన ప్రియులు అల్లాడి పోతున్నారు. 8 రూపాయలున్న గోల్డ్ కింగ్ 12 రూపాయలు, గోల్డ్ ఫిల్టర్, విల్స్‌ఫ్లాక్ ధరలు ఐదు నుంచి ఏడు రూపాయలు కావడంతో సిగరెట్ త్రాగేవారికి దమ్ము కొట్టకుండానే కొట్టినంత పనవుతున్నది.

## జిప ఎన్నిక

9వ పేజీ కొరవ

మెజార్టీ. లేదంటే లాటరీ వేయాల్సి వస్తుంది.

జిప ఎన్నిక ఈ స్థాయికి చేరుకోవడానికి జిల్లా మంత్రి నారాయణ మంత్రాంగమే కారణం. ఆయన జోక్యం చేసుకోకున్నా, చొరవ చూపకున్నా ఎప్పుడో ముగిసిపోయి వుండేది. మునిసిపల్ మేయర్ ఎన్నికలో జరిగిన పొరపాటు మళ్లీ పునరావృతం కాకుండా చాలా జాగ్రత్త పడుతున్నాడు మంత్రిగారు. ప్రతి ఓటు విషయంలోనూ తానే స్వయంగా పర్యవేక్షణ చేస్తున్నాడు. ఎవరి మీదా ఆధారపడడం లేదు. నారాయణకు మంత్రిత్వం ఇవ్వడం జిల్లాలో ఏ తెలుగుదేశం వాదికీ ఇష్టం లేదు. కానీ ఆయన చంద్రబాబు స్వంత మనిషి. ముఖ్యమంత్రికి చాలా దగ్గర. అందువల్ల ఆయన మీద ముఖ్యమంత్రికి ఫిర్యాదులు మోసే పరిస్థితి లేదు. రాజకీయంగా పనికి రాడని నిరూపించడం ద్వారా నారాయణ ప్రాబల్యాన్ని అడ్డుకోవాలని తెలుగుదేశం పార్టీలో అంతర్గతంగా ఒక రహస్య ప్రయత్నం జరుగుతోంది. ఆ ప్రమాదం పసిగట్టిన నారాయణ తనకు తానే జాగ్రత్తలు తీసుకొంటున్నాడు. జిపలో తెలుగుదేశం అభ్యర్థి వేనాటి రామచంద్రారెడ్డిని ఛైర్మన్‌గా గెలిపించగల్గితే ఆ ఘనత మొత్తం మంత్రి గారికే దక్కుతుంది. ఆ కోణంలో చూసినప్పుడు 20తేది ఎన్నిక ఎంత కీలకమైనదో అర్థం చేసుకోవచ్చు. అయితే దీనిపై హైకోర్టు కన్నుపడి వుంది. చిన్న తప్పుజరిగినా, పొరపాటు దొర్లినా న్యాయ స్థానం వూరకే ఉండదు. దానితో అధికారులు కూడా ఒళ్లు దగ్గర పెట్టుకొని పని చేయక తప్పదు.

## గోడ దూకబోతున్నారా?

మొదటి పేజీ కొరవ

ఆయన రాజకీయవాదులను ఒక పట్టు పట్టాడట. వివాదాలంటే మహా సరదా అట. ఆయన జిల్లా ఎస్పీగా నిజంగా ఛార్జి తీసుకొంటే మాత్రం రాజకీయ వాదులకు ఇబ్బందులు తప్పవని చెప్తున్నారు. ఛార్జి తీసుకోకముందే మార్పు కోసం ప్రయత్నం జరగవచ్చునని ఊహ.

ఇదిట్లా వుంటే జిల్లా రెవిన్యూ యంత్రాంగాన్ని కూడా సమూలంగా క్షాళన చేయవలసిన అవసరం ఎంతైనా వుంది. రౌతు మెత్తనైతే గుర్రం మూడు కాళ్ల మీద పరుగెడుతుందని సామెత. నెల్లూరులో రెవిన్యూ యంత్రాంగం రెండు కాళ్ల మీద నడుస్తున్నది. దాన్ని బట్టే రౌతు తీరు ఏమిటో అర్థం చేసుకోవచ్చు. ఉన్నత స్థానంలో ఉన్న అధికారులే లంచాలతో జనాన్ని వేధించుక తింటున్నారు. ఒక ఉన్నతాధికారిణి అయితే ఏకంగా సీనియర్ తెలుగుదేశం నేతలను కూడా లంచాలిమ్మని సతాయిస్తున్నదట. ఆమె మీద ముఖ్యమంత్రికి కూడా ఫిర్యాదు వెళ్లినట్లుంది. తన స్వంత కులస్తులను ఆఫీసులోనే పెట్టుకొని, పని మీద వచ్చే వారిని వారి ద్వారా పిండి పారేస్తున్నదని చెప్తున్నారు. కలెక్టరేట్ ఇంత గబ్బుపట్టడం ఎప్పుడూ జరగలేదు. అధికారులు తమ తీరు మార్చుకోవడం అవసరం. లేకుంటే మొత్తం చరిత్ర పొరపట్టవలసి వస్తుంది.

## జనవాణి

2వ పేజీ కొరవ

హన్‌రెడ్డి గుర్తించి ఆయన్ను వైఎస్ఆర్ పార్టీ శాసన సభా పక్షం కార్యవర్గ సభ్యునిగా నియమించారు. ఇది జిల్లాలో బలహీన వర్గాల ప్రజలందరికీ లభించిన గౌరవమనాలి. అనిల్‌కుమార్ యాదవ్ 2009 ఎన్నికల్లో ఎమ్మెల్యేగా పోటీచేసి కాంగ్రెస్ పార్టీలోని పెద్దలు వెన్నుపోటు పొడవడంతో ఓడిపోయాడు. అప్పటి నుంచి ప్రజల్లోనే ఉండి వారితో మమేకం కావడంతో నెల్లూరు సిటీ ఎమ్మెల్యేగా సునాయాసంగా గెల్చారు. అనిల్‌కుమార్ యాదవ్ సిటీకే పరిమితం కాకుండా జిల్లాలోని మిగతా తొమ్మిది నియోజకవర్గాలలోని బడుగు, బలహీన వర్గాలు, దళితులు, మైనార్టీలు, గిరిజనులకు అండగా నిలవాలి.

*బి.ఆర్.శాలి* కావలి

### ఉచితాలు మానాలి!

ప్రభుత్వాలు జనాకర్షణ కోసం అన్నీ ఉచితం అంటున్నాయి. పెన్షన్లు, ఇళ్లు, పిల్లలకు ఫీజులు, ఉచిత విద్యుత్ ఇలా చెప్పుకొంటూపోతే పెద్ద లిస్ట్ అవుతుంది. దీనివల్ల ప్రభుత్వాల ఆర్థిక వ్యవస్థలు దెబ్బతింటున్నాయి. విచిత్రంగా పాలకపక్షం, ప్రతిపక్షం కూడా ఉచితాల వైపు మొగ్గు చూపడం దారుణం. ప్రజలను ప్రలోభపెట్టి ఏదో విధంగా అధికారంలోనికి రావడం మినహా నేటి రాజకీయ పార్టీల్లో చిత్తశుద్ధి లేకపోవడం విచారకరం.

*టి.కోటేశ్వరరావు* కోవూరు

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### డిప్యూటీ డిఇఓ మాకొద్దు!

నెల్లూరు డిప్యూటీ డిఇఓ మేరీ చంద్రికను తొలగించాలని యుటిఎఫ్ డిమాండ్ చేసింది. గతంలో డిఇఓగా వుండి సస్పెండైన మువ్వా రామలింగంతో కలిసి ఆయన అక్రమాలను నిల దీసిన ఉపాధ్యాయులపై కక్ష సాధింపులకు ఆమె పాల్పడిందని, తప్పుడు నివేదికలు ఇచ్చి టీచర్లను ఇబ్బంది పెట్టిందని యుటిఎఫ్ నేతలు శ్రీహరి, పరంధామయ్య, ఆర్‌జెడికి ఫిర్యాదు చేశారు. ఆమెను తక్షణం తొలగించి వేరే వారిని ఆ స్థానంలో నియమించాలని వారు కోరారు.

### దుర్గంధ భరితంగా ఫత్తేఖాన్‌పేట

కాలువల్లో పూడికతీత పనులు చేపట్టిన అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించడంతో ఫత్తేఖాన్‌పేట ప్రాంతం మురుగు నీటిలో మునిగింది. రైతు బజారు వద్దగల కాలువలో ప్రొక్లెయిన్ పెట్టి పేరుకు పోయిన చెత్తను తొలగించారు. ఈ కారణంగా రైతుబజారు చుట్టుప్రక్కల ఇళ్లు, పాఠశాలలోకి

## పదరంగం -120

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | | 4 | | 5 | | 6 |
| 7 | | | | 8 | | | 9 | 10 | |
| 11 | | | 12 | | | | | 13 | |
| | | 14 | | | 15 | 16 | 17 | | |
| | 18 | | | | 19 | | | | |
| 20 | | | | 21 | | | | | 22 |
| 23 | | | 24 | | | | | | |
| | | 25 | | | | 26 | 27 | | |
| 28 | 28 | | | 30 | 31 | | | | |
| 32 | | | | | | | 33 | | |

**అడ్డం**

1. ఉపయోగకరం (4)
4. అద్దం (3)
7. రక్తి లేకపోవడం అయిష్టం (3)
8. నిరాశ కాదు దీర్ఘం కలది (2)
9. వయస్సు, ఈడు (3)
11. కుముదములో 3,4 అక్షరాలు (2)
12. తెల్లవారు జాము (3)
13. ఆశ్లేష, పుబ్బ నక్షత్రాలకు మధ్య నక్షత్రం (2)
14. తాడు అంచు (2)
15. చెదిరిన సంతానం (3)
18. విరాటార్జునీయం కృతి కర్త, సంస్కృత కవి (3)
19. యువకవి రవి – 5,1,4 అక్షరాలు (3)
20. వైనతేయుని మాత (3)
21. కృష్ణదేవరాయల కావ్యం (6)
23. అధికము (2)
24. ఆవులు (3)
25. అటునుంచి... తీయగా (3)
26. సిల్వర్ స్క్రీన్ (4)
28. గృహ సామగ్రికి ఉపయోగపడే కొయ్య (3)
30. తమిళ హాస్యనటుడు అటునుంచే (4)
32. వర్ధిల్లు, వెలుగొందు (4)
33. యమధర్మరాజు (3)

**నిలువు**

1. స్త్రీలు, మహిళలు (4)
2. ఇహము కాదు (3)
3. ఉపాయం (2)
4. పది అవతారములు (7)
5. క్రింద నుంచి జీవం (2)
6. సుముఖము కాదు (4)
8. పత్రము, లీఫ్ (2)
10. ధర్మరాజు ముందు చేరితే అతడు దక్షిణాధిపతి (2)
12. ఎండాకాలం (3)
14. లేమి, డెఫిషిట్ (3)
16. పృధ్వీరాజ్ గారి రాణి (3)
17. చెదిరిన విమానం (3)
18. సూర్యుడు (3)
20. తెనాలి రామలింగుని బిరుదు (5)
21. గోక్షీరం (4)
22. దాశరథిగారి తండ్రి (5)
24. బాధ, మొర (2)
25. తపస్సు చేసినవాడు (3)
26. బంగారం తరువాత విలువైన లోహం (2)
27. క్రిందనుంచి రెండువైపుల ఉట్లు గల వెదురుబద్ద (3)
29. రెండు 'ల'లు (2)
31. తెలుగు హంటింగ్ (2)

**సమాధానాలు**

## పదరంగం -119

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఊ | ర | 2 ట | | 3 ఒ | క | 4 టి | | 5 తీ | 6 వా |
| తం | | 7 ము | 8 త | క | | 9 క | 10 స | ము | ల |
| | 11 న | కు | లు | డు | | 12 చీ | త్కా | ర | ము |
| 13 మ | గ | | పు | | 14 శి | | రం | | |
| 15 మే | ము | 16 ఘ | | 17 అ | వు | ను | | | 18 జ |
| కం | | 19 నం | 20 ద | ను | డు | | | 21 ప | గ |
| | 22 మి | | 23 గా | జు | | 24 తి | 25 ప | ర | తి |
| 26 సా | గి | ల | ప | డు | | 27 మ్మ | ని | దా | |
| 28 మె | లి | | డి | | 29 బా | రు | వా | | 30 ఖా |
| 31 త | న | | 32 న | ర | కా | సు | రు | డు | |

## 2014 నెల్లూరు సిటీ నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 142 | లక్ష్మీపురం | 517 | 270 | 233 | 6 |
| 143 | పప్పులవీధి | 416 | 182 | 218 | 6 |
| 143ఎ | పప్పులవీధి | 522 | 260 | 235 | 9 |
| 144 | పప్పులవీధి | 478 | 189 | 266 | 12 |
| 145 | నవాబుపేట | 634 | 270 | 334 | 13 |
| 146 | పప్పులవీధి | 838 | 337 | 452 | 21 |
| 147 | పప్పులవీధి | 565 | 280 | 248 | 15 |
| 148 | పప్పులవీధి | 587 | 304 | 248 | 13 |
| 149 | పప్పులవీధి | 334 | 146 | 177 | 4 |
| 150 | తడికలబజారు | 478 | 149 | 302 | 11 |
| 151 | నవాబుపేట | 310 | 103 | 187 | 8 |
| 152 | ఉస్మాన్‌సాహెబ్‌పేట | 722 | 326 | 362 | 16 |
| 153 | ఉస్మాన్‌సాహెబ్‌పేట | 524 | 244 | 255 | 13 |
| 153ఎ | ఉస్మాన్‌సాహెబ్‌పేట | 395 | 154 | 211 | 17 |
| 154 | తడికలబజారు | 712 | 290 | 389 | 8 |
| 155 | తడికలబజారు | 515 | 159 | 335 | 8 |
| 155ఎ | తడికలబజారు | 335 | 120 | 190 | 12 |
| 156 | ఉస్మాన్‌సాహెబ్‌పేట | 825 | 358 | 429 | 12 |
| 157 | స్టోన్‌హౌస్‌పేట | 713 | 217 | 445 | 30 |
| 158 | స్టోన్‌హౌస్‌పేట | 447 | 189 | 233 | 8 |
| 159 | స్టోన్‌హౌస్‌పేట | 459 | 173 | 267 | 7 |
| 159ఎ | స్టోన్‌హౌస్‌పేట | 382 | 149 | 217 | 8 |
| 160 | నవాబుపేట | 581 | 192 | 346 | 13 |
| 161 | ఉస్మాన్‌సాహెబ్‌పేట | 515 | 252 | 230 | 12 |
| 162 | నవాబుపేట | 449 | 213 | 216 | 8 |
| 163 | నవాబుపేట | 204 | 96 | 100 | 3 |
| 164 | తడికలబజారు | 684 | 331 | 327 | 14 |
| 165 | రాయపుపాళెం | 611 | 269 | 321 | 6 |
| 166 | సరస్వతీనగర్ | 516 | 279 | 216 | 6 |
| 167 | సరస్వతీనగర్ | 324 | 147 | 160 | 4 |
| 168 | ఎన్టీఆర్‌నగర్ | 676 | 343 | 299 | 8 |
| 169 | సరస్వతీనగర్ | 759 | 392 | 330 | 18 |
| 170 | సరస్వతీనగర్ | 410 | 115 | 261 | 12 |
| 171 | ఎన్టీఆర్‌నగర్ | 522 | 217 | 257 | 12 |
| 172 | బాలాజీనగర్ | 64 | 38 | 16 | 3 |
| 173 | ఎసినగర్ | 564 | 236 | 300 | 7 |
| 174 | బాలాజీనగర్ | 500 | 231 | 239 | 15 |
| 175 | బాలాజీనగర్ | 529 | 189 | 312 | 14 |
| 176 | బాలాజీనగర్ | 502 | 221 | 262 | 6 |

## 2014 నెల్లూరు సిటీ నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 177 | బాలాజీనగర్ | 463 | 282 | 155 | 4 |
| 178 | వేపదొరువు | 455 | 197 | 232 | 10 |
| 178ఎ | వేపదొరువు | 436 | 201 | 204 | 15 |
| 179 | వేపదొరువు | 721 | 361 | 300 | 15 |
| 180 | వేపదొరువు | 524 | 249 | 243 | 17 |
| 181 | వేపదొరువు | 576 | 300 | 243 | 15 |
| 182 | వేపదొరువు | 503 | 217 | 249 | 17 |
| 182ఎ | వేపదొరువు | 352 | 156 | 169 | 10 |
| 183 | వేపదొరువు | 438 | 183 | 231 | 8 |
| 184 | వేపదొరువు | 387 | 152 | 213 | 14 |
| 185 | వేపదొరువు | 318 | 142 | 165 | 3 |
| 186 | వేపదొరువు | 394 | 211 | 163 | 8 |
| 186ఎ | వేపదొరువు | 348 | 186 | 147 | 6 |
| 187 | వేపదొరువు | 385 | 196 | 164 | 11 |
| 187ఎ | వేపదొరువు | 335 | 159 | 158 | 9 |
| 188 | ఎసినగర్ | 586 | 251 | 307 | 6 |
| 189 | ఎసినగర్ | 354 | 178 | 154 | 14 |
| 189ఎ | ఎసినగర్ | 377 | 187 | 160 | 13 |
| 190 | ఎసినగర్ | 496 | 292 | 182 | 4 |
| 191 | ఎసినగర్ | 433 | 177 | 223 | 8 |
| 192 | ఎసినగర్ | 357 | 139 | 190 | 7 |
| 193 | ఎసినగర్ | 567 | 295 | 239 | 12 |
| 194 | బాలాజీనగర్ | 518 | 254 | 222 | 17 |
| 194ఎ | బాలాజీనగర్ | 429 | 161 | 237 | 8 |
| 195 | బాలాజీనగర్ | 378 | 182 | 169 | 8 |
| 196 | బాలాజీనగర్ | 431 | 208 | 185 | 13 |
| 197 | బాలాజీనగర్ | 698 | 324 | 331 | 15 |
| 198 | బాలాజీనగర్ | 447 | 228 | 202 | 9 |
| 198ఎ | బాలాజీనగర్ | 498 | 264 | 211 | 4 |
| 199 | వేపదొరువు | 382 | 171 | 183 | 11 |
| 199ఎ | వేపదొరువు | 424 | 223 | 173 | 10 |
| 200 | రామలింగాపురం | 647 | 335 | 291 | 5 |
| 201 | రామలింగాపురం | 385 | 199 | 169 | 2 |
| 202 | రామలింగాపురం | 291 | 179 | 85 | 13 |
| 202ఎ | రామలింగాపురం | 446 | 203 | 214 | 12 |
| 203 | రామలింగాపురం | 650 | 282 | 313 | 21 |
| 204 | వెలమవారిదిన్నె | 609 | 442 | 134 | 17 |
| 204ఎ | వెలమవారిదిన్నె | 732 | 533 | 167 | 13 |
| 205 | వెలమవారిదిన్నె | 521 | 312 | 144 | 44 |

# ఆత్మ, ప్రేతాత్మ, భూత, పిశాచ గణ, నిరోధక యంత్రం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

డాక్టర్ జాన్సన్ — బెంగుళూరు

* *మంత్ర శాస్త్రం, క్షుద్ర విభాగాన్ని, వాస్తు శాస్త్రం ఏ 'శక్తి'తో నిరోధిస్తున్నది?*

మంత్ర శాస్త్రంలోని అన్ని క్షుద్ర విద్యలకు విశ్వామిత్ర, గౌతమ మహర్షులు శక్తి మంత్రోపాసన, బీజాక్షర సహిత యంత్రాలను నిరోధించారు. అందుచేత క్షుద్ర విద్య ప్రయోగాలుంటే ఆయా యంత్ర ప్రతిష్టల వల్ల ఆయా దోషాలు నిరోధించబడుతాయి.

పి.హరినారాయణ — చెన్నై

* *ఎప్పుడూ ఏదో ఒక సమస్య వెంటాడుతూ వుంది. ప్లాను, జాతకం పంపిస్తున్నాను.*

మూడు ద్వారాలు మీ ఇంట్లోని ప్రధాన సమస్య. మూడవది రాక్షస ద్వారం అవుతుంది. రెండవది వాయువ్యంలోని సెప్టిక్ ట్యాంక్. దాన్ని వెంటనే తొలగించి తూర్పు, ఉత్తరాల్లో ఎక్కడో ఒక చోట ట్యాంకు నిర్మించుకోండి.

డి.సుబ్బారావు — తిరుపతి

* *యంత్ర ప్రతిష్ట వల్ల ఆమెలోని విపరీత ప్రవర్తన చాలా వరకూ తగ్గింది.*

ఆమెలోని మానసిక రుగ్మత తీవ్రతను యంత్ర బీజాక్షరాలు 'స్వాహా' చేశాయి. అందు వల్లే ఈ పరిణామం జరిగింది. ఇప్పుడు మీరు కోర్టు వ్యాజ్యాన్ని వెనక్కుతీసుకొని ఆమెను క్షమించండి. ఆ తర్వాత రత్నధారణ వల్ల ఆమె పూర్తిగా మారుతుంది.

వై.తులసి — సికింద్రాబాద్

* *వ్యాధి ప్రారంభంలో అదుపులోకి వచ్చింది. తర్వాత విపరీతంగా పెరిగిపోయింది. ఎందువల్ల?*

మీ జాతకాన్ని పరిశీలించాను. గ్రహ శాంతి, మీ నమ్మకం వల్ల అట్లా వ్యాధి నిమ్మళించింది. ఆ తర్వాత గ్రహ ప్రభావాల తీవ్రత మీలో భగవంతుడి పట్ల నమ్మకం తగ్గడం అనే కారణాల వల్ల మీరు ఓడి, వ్యాధి గెలిచింది.

# ఎస్పీ బదలీ నిలుస్తుందా - గబ్బు పట్టిన కలెక్టరేట్!





నెల్లూరు జిల్లా ఎస్పీ నవదీప్ సింగ్ గ్రేవాల్ బదలీ అయ్యారు. ఆయన జిల్లాకు వచ్చి ఐదు నెలలు కూడా పూర్తి కాలేదు. ఇంతలోనే బదలీ. విజయనగరం ఎస్పీగా పంపారు. నెల్లూరుకు అనంతపురం ఎస్పీ సెంథిల్ కుమార్‌ను పంపారు. ఈ బదలీలలో రాజకీయ కోణాలు, కారణాలు ఉన్నట్లు కన్పించడం లేదు. కనీసం ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కూడా జోక్యం చేసుకోలేదని వినికిడి. ఎస్పీ, డిఎస్పీ స్థాయి బదలీలలో డిజిపి రాముడుకు పూర్తి స్వేచ్ఛ ఇచ్చాడట చంద్రబాబు. నిర్ణయాలన్నీ ఆయనవే అని చెప్తున్నారు.







నవదీప్‌సింగ్, ఆవాహన విసర్జన లేని అధికారి. అంత చిన్న వయస్సులో అంత ఓపికలేని మనిషిని అరుదుగా తప్ప చూడలేము. ఆఫీసుకు రావడం కష్టం. వచ్చినా పని చేయడం ఇంకా కష్టం. వారానికి ఒకరోజు కూడా తన క్రింది అధికారులతో కూడా మాట్లాడడా యన. జనాన్ని కలవడం అసలే లేదు. ఫిర్యాదుల దినం కూడా డిఎస్పీలకే వదిలేసి, తాను హాయిగా ఇంట్లోనే ఉండిపోయేవాడు. జిల్లాలో ఎర్ర చందనం చోరీలపై రాష్ట్రమంతా గగ్గోలు రేగినా, నగరంలో చిల్లర దొంగతనాలు నిత్యకృత్యంగా మారినా కనీస పాటి స్పందన కూడా చూపలేదు.

కొత్తగా వస్తున్న సెంథిల్ కుమార్ దీనికి భిన్నమైన అధికారి అని తెలుస్తున్నది. అనంతపురంలో

కొరవ 14వ పేజీలో







Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: +91-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com, website: www.zaminryot.com